శ్రీ ర స్తు.

# నరసభూపాలీయము.

## కావ్యాలంకారసంగ్రహము.

శ్రీలీలాపతి దానురోమణిసభా సింహాసనత్కౌస్తుభా
వేలాభాప్రతిబింబితాంగియయిన స్వేచ్ఛాకృతం దాల్చినాఁ
డౌలేయుంచుఁదలంచునో యనియమందానందుఁడై లక్ష్మినే
వేళంగౌఁగిటఁ జేర్చు శౌరి నరసోర్వీనాథునిం బ్రోవుతన్, ౧

సీ॥ ఏ శేషు కడలిరాచూలియౌ యొత్తిగించుఁ గలితవళితరంగములపాగు
ఏమానినీరత్న ముం[illegible]యాటఁ బ్రకటించు మొగముపోలిక తెఱంగు
ఏ తన్వికందర్పమాత యౌ యొత్తిగించుఁ గరగృహీతాంభోజకాండకలన
ఏ సాధ్వి దనుజారి యిల్లాలవుటఁ జెల్పు నలినినీలాబ్జజిన్నయనగరిమ
యట్టి శ్రీదేవి సుకవివాగమృతదంబు। నఖిలభువనోన్నతము నైనయౌభళేంద్ర
నరసవిభుమందిరంబాత్మశరణమనుచు। నుండి యేకాలమును బాయకుండుఁగాత. ౨

చ॥ పలుకులకొమ్మ నెమ్మొగముఁ బార్వణచంద్రునిఁ గాఁదలంచియు
జ్జ్వలనిజభద్రపీఠజలజంబు నిమీలితమౌనాయంచు నే
ర్పలవడ భారతీవనిత నాత్మముఖంబులలో నెతాల్చుచుం
జెలఁగు విధాత యోబయనృసింహునకిచ్చుం జిరాయురున్నతుల్, ౩

సీ॥ ఒకటి యక్షరవిలాసోల్లాసముమఱించ నొకటి తాళప్రౌఢి నుల్లసిల్ల
నొక్కటి నారికేళోన్నతి దాల్ప నొక్కటి గోస్తనీగుచ్ఛకలనఁ దనరఁ
నొకటి సువృత్తభావోన్నమ మొంద నొక్కటి వల్లకీతుంబికలనఁ జెలఁగ
నొకటి భారవిశేషయుక్తిఁ బెంపొంద నొక్కటి గిరీశమతానుకారి గాఁగ
నసమసాహిత్యసంగీతరసములనెడు। గుబ్బపాలిండ్లు దాల్చు పల్కులవెలంది
సరసగుణహారు నోబయనరసధీరు। నన్యకృతినాయకునిఁ గానొనర్చుఁగాత, ౪.

శా॥ గంగం దాల్చితి నుత్తమాంగమున నంగైకొంటి గావించితి
ర్ధాంగీకారమనంబురంధ్రి నిను వామాంగంబునం గాల్పనే

శృంగారోన్నతిఁ జూడుమంచు గిరిజన్ శ్లాఘాపరాలింగిత
స్వాంగానందితఁ జేయు శంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోచుత౯

చ॥ అరుదుగ వామభాగ లలనాకలనాచలనాత్మఁ బైనయా
హరుగురుఁ గాంచి తానును దదాకృతి యాగతి నేకదంతుఁడై
కరికరిణీగుణంబులు మొగంబునఁ దాల్చి జగంబులేలు నా
తరళకరుణాసనాథు గణనాథు మరుద్గణనాథుఁ గొల్చెద౯

॥ తనయాస్యగహ్వరంబునకు ఖద్యోతజృంభణము ఖద్యోత జృంభణముగాఁ గఁ
దనకరాంభోజాతమునకు లగంధమాదనము కగంధమాదనముగాఁ గఁ
దన శౌర్యవార్యత్తమునకు మైరావణస్ఫురణ మైరావణస్ఫురణగాఁ గఁ
దన వాలదంభోళికి నయకర్బురగోత్ర గరిమ కర్బురగోత్రగరిమగాఁ గ
వలు రామానుజన్మజీవప్రదాన । ధుర్యపర్యాయధాత మేదురవిరోధి
బలపయోధిఖిలంబున ప్రబలశక్తి । యోబయనృసింహభూభర్తకొసఁగుఁగాఁ దత్ర

సీ॥ ఏవ్వాఁడు మొదలఁ దానిలకు భారతిఁ దించెఁ దగ భగీరథుఁడు భాగీరథినిఁ బోలె
భ్రమరకీటన్యాయభాతి నేకవిరాజు వాగ్దేవి దాన యొవ్వాని కెక్కె
వరవృత్తములు మాని వాణి యెవ్వానికై వలచి నానాశ్లేషములకుఁ జిక్కె
నెవ్వాని వాఙ్మాత్రమిను నిధాత్రికి దెచ్చి కీర్తితోఁ గరము లర్పించుకొనియె
నట్టి మహిమాధికులఁ గొల్చి యఖిలమనివ। చోనుపమశక్తిభృతపురాణార్థవితతు
లనుగు దెనుగను భవ్యాదివ్యాంజనమున। గనుగొనగఁ జేయు నంధ్రసత్కవులఁ దలఁచి

సీ॥ ఏమహాత్ములు గల్గ భూమీశసభలలోఁ గవులకు నధికవిఖ్యాతి గల్గె
నేకృతార్థులు గల్గ నెల్ల పామరులకు గణనమీఱు ప్రబంధకములు గల్గె
నేవాక్ప్రభులు గల్గ నిరవొందు రసికుల కమితలీలావినోదములు గల్గె
నేప్రవీణులు గల్గ నిలనలంకృతి కృతోద్యములకు దోషలక్ష్యములు గల్గె
నేదయాళురు బుధవచోహేతిచకిత। విసరదపశబ్దభరణలాలసముఖాబ్జ
లట్టి నిఖిలోపకారధీరాత్ములయిన । సకలకవిధుర్వహులకు నంజలియొనర్తు

వ॥ ఇవ్విధంబునఁ బ్రారిప్సితగ్రంథనిర్విఘ్నపరిసమాప్తి సంప్రదాయావిచ్ఛేద లక్ష్య
నిబంధనంబుగా నిఖిలాభీష్టదేవతా నమస్కారణంబును సుకవిబహూకరణంబును
కుకవినిరాకరణంబును గావించి యుదంచితవిరించి సంచితప్రపంచచరదభంగ
ధపుంగవహృదయంగమంబును గంభీరరససముజ్జృంభితకవితాంబోధి తరణకర
కుశ్లోపకరణపరిణతతరణిప్రకాండంబు నశేషగుణదోష విశేషదుష్పారపార

కవిశేఖరశ్లాఘిత ప్రశంసితహంసాయమానప్రతిభా సుబంధంబునగు నొక్క ప్రబం
ధంబునిర్మింపఁబూనియున్న సమయంబున, ౧౦

సీ॥ లలితాళలంకారకలాకలాపంబున నేరాజు రేరాజు నేవగించు
భూభారభరణలీలాభిముఖ్యంబున నేమేటి తామేటి నెగ్గులాడుఁ
జతురభాషామహీమాతిశేషావాప్తి నేభోగియాభోగినీసడించు
శరణాగతగణాతిభరణాధికగుణావాప్తి నేశౌరియాశౌరి నేపుమాపు
నతఁడురిపురాడఖర్వగర్వాంధకార।గంధనిర్గంధనాంభోజబంధుబాంధు
బంధురౌదార్యశౌర్యధురంధరుండు।సరసగుణహారుఁడోబయనరసఘనుఁడు౧౧.

వ॥ వెండియుం బ్రచండభుజదండకాండతమండలాగ్ర ఖండితారాతి మండలుండును నఖండనవఖండ పృథ్వీమండలధురాభరణ పరాభూత ఖండపరశుకుండలుండును బ్రహ్మాండకరండపూరిత చండిలయశఃపూర కర్పూరహారుండును సరస్వతీమనోభాండా గారకారుండును సమరసమయసముజ్జృంభిత జంభారిదోస్తంభ-సముత్తంభి త దంభోళి ధారావిదారిత మహాభీలశైలాళి విశాలరవకోలాహల లీలాహళహ ళికా సమారంభ సంరంభసుభగంభావుకగంభీరవిజయభేరీభయంకర ఘాంకార ఝంకారసముట్టంకిత దిగ్విటంకుండును నత్యుద్రతరసురక్షోభకర మదోన్మత్తరక్షో న్నత రక్షోవరవక్షోవిక్షోదవిచక్షణాక్షీణ నృహర్యక్షరూక్షవీక్షణీ భవదాశు శు క్షణితీక్ష్ణసముత్క్షిప్తకీలాకరాళో విచ్ఛిన్నాచ్ఛచ్ఛాయాచ్ఛటా పటిమ ఘటన చ టుల ప్రతాపవైభవుండును నుభయరగండగండభేరుండాది బిరుదామంద సం దీపిత ప్రాభవుండును నసాధారణమేధావిదారిత వేదోపవేదోపబోధనిర్నిరోధ మధురమధురసావధీరణ సమగ్రవాగ్రథనధన సుధీజనగృహద్వారనిర్భిద్రభద్ర వారణఘటావికటకటకటాహతటీ పతదనూనదానాంభోఝరీపరిమళ పరిలబ్ధి లబ్ధామోదమధుర భృంగీతరంగితగీతభంగీ ప్రసంగత ప్రసంగాంగీకృతనిరంతర దిగంతర విశ్రాంత విశ్రాణనజయానకుండును గుళికసుతకులజలధి చైత్రకుం డును నానావిధభూనాధికసేనాంబు నిధానానుపమానాహవమానా మితామో ఘైకరిపరీతబరీదసపాద సప్తాంగహరుండును భోజరాజవంశసంభవుండును ల క్కాంబాగర్భపావనుండును బరమభాగవత సంభావనుండును నోబభూపాలపు త్రవరుండును గడిదుర్గస్థాపనాచార్యుండును సత్యభాషాహరిశ్చంద్రుండును నగు నృసింహక్షితీంద్రుం డొక్కనాఁడు రుచిరరుచిశుచితావిశేషభూషితో ర్వర్భుధులు బుధులు సరస్వతీ ప్రవాహసంతతవిహారమాణ మహోకవులుకవులజిష్ణుజిష్ణోరంగన్నృ త్యదుత్తుంగగైర్వాణ వాణీప్రాకృతసారసేవ్యపభ్రంశపైశాచికామాగధులు మహా

గధులు నటనజిత మహానటులునటులు మం యౌవన సౌందర్య వసతులు సతులు నయవినయ సౌజన్యులు రాజన్యులవధీరిత సురరాజమంత్రులు మంత్రులు ప్రబల బలోద్భటులు భటులు పురోహితులు హితులు పౌరాణికులు వైణికులు గాయకులు గణికులు నాదిగాఁగలనిఖిల నియోగిజనంబులు బలిసికొలువ మణిమయాస్థానమధ్యభద్రాసనంబున సుధర్మాసీనుండగు శునాసీరుచందంబున నందంబుగాఁగొలువుండియప్పుడు, ౧౨.

సీ॥ శతలేఖినీపద్యసంధానధౌరేయుఘటికాశతగ్రంథకరణధుర్యు
నాశుప్రబంధబంధాభిజ్ఞునోష్ఠ్యనిరోష్ఠ్యజ్ఞు నచలజిహ్వాయుక్తినిపుణుఁ
దత్సమభాషావితానజ్ఞు బహుపద్యసాధితవ్యస్తాక్షరీధురీణు
నేకసంధోచితశ్లోకభాషాకృత్యచతురు నోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు
నమితయమకాశుధీప్రబంధాంకసింగ । రాజసుతతిమ్మరాజపుత్రప్రసిద్ధ
సరసవేంకటరాయభూమణిసుపుత్రు । ననుబుధవిధేయుశుభమూర్తినామధేయు.

కం॥ కనుఁగొనిదయామరందము । కనుదమ్ములఁగ్రమ్మనుచితగౌరవలీలా
ఘనతరగభీరభావము । ననియెన్నరసింహుఁడభినవానందముతోన్, ౧౩.

సీ॥ బాణవేగంబును శ్రీవత్సమాత్రసుమహమారుతయు మాఘశైత్యంబు దండిసమత
యలమయూరసువర్ణకలనచోరుత్వియర్థసంగ్రహమ్మమురారికయ్యనేర్పు
సోమప్రసాదంబుసోమయాజుల నియమంబుభాస్కరునసమ్మాగణఘటన
శ్రీనాథునిపదప్రసిద్ధధారాశుద్ధియమరేశ్వరుని సహస్రసముఖద్యుత్వి
నీకకలదటుగాననేకవదన । సదనసంచారఖేదంబుసడలుపఱచి
భారతీదేవినీజిహ్వఁబాదుకొనియె । మూర్తికవిచంద్రవిఖ్యాతకీర్తిసాంద్ర, ౧౪.

ఉ॥ కావుననీయుదగ్రమతి గౌరవయోగ్యనిరూపణంబుగా
నీవొనరింపఁబూనినయనేకమహాకవివాక్యయోపకా
రావహమైనకావ్యముమదంకితమైవెలయంగఁజేయుము
శ్రీవలయప్రసిద్ధబుధవిస్మయదానధురంధరంబుగన్, ౧౫.

వ॥ అనిసబహుమానంబుగాఁ గర్పూరతాంబూలజాంబూనదాంబరాభరణ ఛత్రచామరాందోళిక చతురంతయానాగ్రహారాది ప్రదానంబుల బహూకరించుటయు నేను నానందకందళితతరంగితాంతరంగుండనై, ౧౬.

సీ॥ నిజరూపమునకువన్నియదెచ్చువేలొక్కచేకొండుధ్వనిహీరకళికలమర
ఛాయాంతరాలక్ష్యసహజశోభమునైనలక్షణలైహ్యవ్యలక్షణంబర

రతులతోఁ దులదూఁగు రమణీయరస విశేషములను గారుత్మతములు మెఱయ
గురుసువర్ణగుణైకగుంభితస్థితిఁ బాల్పు నాయకనాయకోన్నతులు సెలఁగ
నిలుచు నలంకారనికరంబు లిరవుకొలిపి । కమలభవగేహినీపరిష్కరణకరణ
యోగ్యములుగా నొనర్చిన భాగ్యనిధుల । భామహాదుల వినతంబుఁ బ్రస్తుతించి ౧౮.

క॥ వారిప్రసాదమున నలం । కారము ధ్వని లక్షణాధికారరసాలం
కారము నా నతుల నాంధ్రీ । పారచనచమత్క్రియావిశోభితమతినై ౧౯.

గీ॥ అనద్యశరసప్రధానశబ్దార్థములును । రీతులు సువృత్తులును సలంకృతులు గుణము
లాదియగు లక్షణంబుల నలరఁ గావ్య । సరణి యందు నలంకారసారవిధుల ౨౦.

క॥ ఈ కావ్యలక్షణంబుల । నేకులు దొల్లింటి పెద్దలేర్పఱచిననుఁ
శ్లోకన్నపచరితను త్రిదీ । లోకలనయును నభినవాంధ్రకవితయును గుటఁ ౨౧.

వ॥ ఏతత్ప్రబంధబంధురా వ్యాజకావ్యాలాప లక్షణ తృతలక్షణవిచక్షణ ప్రసంగసంగ్ర
హాణ నిర్వాహకృత్యంబున నత్యంతంబు నర్హుండ ; నావసరు. డనై ౨౨.

క॥ బంధురతరప్రబంధుల । గంధములకనంతకీర్తిభాగ్యప్రదధౌ
రంధర్యగ్రంధిలము వ । సుంధరనవద్యగ్రమణిసుగుణ స్తనమల్ ౨౩.

సీ॥ రామాయణాదిక గ్రంథంబులనవద్య నైత్పవణాలవన్నియును నెక్క
వై శేషికాదినానాశాస్త్రములు శివ ప్రతిపాదనమున సన్నుతి వహించె
సంధ్యాదిమంత్రములు శివ్వదీశ్వర నామజపసాధనతన నశ్వరములయ్యెఁ
బలుకులొందొంటికిఁ బ్రామిన్కులును బరబ్రహ్మగోచరములై ప్రణుతిఁ గాంచె
ననినఁ గావ్యంబు మేయ నాయకవిశష్వ్న। రస్వరూపనిరూపణ ప్రాజియగుట
వేరఁబవగింప నేల బంగారమునకుఁ । బటుల సౌరభ్యలహరియబ్బుటయ కాదె ౨౪.

శా॥ వేదంబుల్ నృపశాసనంబులు సుహృద్విజ్ఞాపనంబుల్ పురా
ణాదిగ్రంథములంగ నాజనవిలాసాలాపలీలాసమ
ప్రాదుర్భావము లౌర కావ్యములు కర్తవ్యోపదేశక్రియా
వాదప్రక్రియ లెన్నఁ గావ్యమహిమవ్యాణింపఁగా శక్యమే ౨౫.

మ॥ పరమజ్ఞానలతాలవాలము జగత్ప్రఖ్యాతవిఖ్యాతసా
గరచంద్రోదయమిష్టసంఘటనరేఖాదివ్యధేనూత్తమం
బురుకార్పణ్యదశానిశాదినముఖంబు ద్వేలనిర్వాణభో
వ్యరసాస్వాదరసాయనంబనినఁ గావ్యంబెన్న సామాన్యమే ౨౬.

సీ॥ భవ్యుఁడాతఁడు దీర్ఘబాహునిఁ గనియె నాతఁడుం గాంచె రఘువునాతనికిఁ గలిగెఁ
బురుషాదుఁడతనికిఁ బొడమెఁ గల్మాషపాదుఁడు తత్సుతుఁడు శంఖనుఁడు సుదర్శ
నుఁడు దత్తనూజుండాతఁడుం గాంచె నగ్నివర్ణమహీశు నతఁడు శీఘ్రగునిఁ బడసె
నతనికి మరుఁడుదయాత్మజుఁడుం బ్రశుశ్రుకుఁ డాతని కంబరీషుఁ డాతనికి నహుషుఁ
డతనికి యయాతి నాభాగుఁ డతనికతని । కజుఁడు దశరథుఁ డతనికి నతని కొదవె
రామభద్రుఁడు దద్వంశరత్నమయ్యె । సారిదిగలి పెళఁగలికాలచోళవిభుఁడు, ౩౪

సీ॥ ఏరాజు వివిధపుష్పారాధనమున గంగాధరుతలమీలకాచు మానె
నేరాజు దివ్యాన్నసారార్పణంబున శితికంఠు మెడనున్న చేఁదు మానె
నేరాజు రత్నోపహారానుభవభూతి రుద్రు సెమ్మలదండరోఁత మానె
నేరాజు కాంచనాగారారచనకేళి భవునకు గిరులెక్కు పాటు మానె
జలధిదేవేరిఁ గావేరి జనులు సూచి । కుండనాచ్ఛాదన మొనర్చునో యపుడెరయ
నుభయతటములందరు పట్టణులని పెనేన్నృ । పాలుడతఁడొప్పఁ గలికాలచోళవిభుఁడు

చ॥ అతఁడు మహాదిగంతవిజయంబొనరించి సురాద్రియాలను
న్నతనిజమీనలాంఛన మొనర్చుటకై గిరిరాజుఁ ద్రిప్పన
ప్రతిమతదీయదోర్యుగ భరభ్రమితాచలశృంగగంగతా
మితజవరూఢి నేఁడు నభ్రమించుఁ దదగ్రగతగ్రహావళుల్, ౩౬

తే॥ గీ॥ శ్రీలఁ జెలవొందు నాకలికాలచోళ । కుంభినీనాథుకులమున సంభవించె
ఘనఖనిక్షోణిరత్నంబుగలుగురీతి । భోగసౌభాగ్యసురరాజు పోచిరాజు, ౩౭

సీ॥ తనకీర్తికజరవాహినియీడుగామికి నమ్మహానదితోడి యమున సాక్షి
తనప్రతాపస్ఫూర్తికిని వేఁడిసరిగామికతని బింబము దూరునరులు సాక్షి
తనధైర్యమహిమకుఁ గనకాద్రి ప్రతిగామి కచటఁ గాఁపున్న గోత్రారి సాక్షి
తనకాంతికి మృగాంకుఁడెనగామికతనితో సరిపొత్తు మనుకర్మ సాక్షి సాక్షి
గాఁగ విలసిల్లు ననుపమక్షాత్రధర్మ । పరతనృపపఙ్క్తికిఁ జోడొజబంతి యనఁగ
రాజమృగరాజు వైభవరాజరాజు । భూరిసౌందర్యరతిరాజు పోచిరాజు, ౩౮

క॥ ఆపోచిరాజవంశసు । ధాపారావారమునకుఁ దారాపతియై
యేపొందుఁ దిరుమలక్షో । ణీపాలుఁడనంతకీర్తి నిత్యోజ్జ్వలుఁడై, ౩౯

సీ॥ రక్షించినాఁడు హిరణ్యధారావృష్టిఁ జతురార్థిసంఘాతచాతకముల
శిక్షించినాఁడుగ్రకౌక్షేయపవిధారఁ బ్రతిపక్షగిరిలక్షపక్షగరిమ

వీక్షించినాఁడు సద్విధవావహ వివాహసదనంబు గదనంబు సరియకాఁగఁ
బ్రోక్షించినాఁడు సంపూర్ణ దయాధార వితతావదాతపా వృతులమీఁద
నతఁడు రాజన్యమాత్రుఁడే యుపరశిఖరి । చరమగహ్వరబంహిష్ఠజరఠతిమిర
పటలపాటనపటు మహోభాస్వరుండు । రాజకులమౌళి తిరుమలరాయమౌళి, ౪౦.

క॥ ఆరాజశిఖామణికిన్ । ధీరాత్ముకలుతనయుఁడైరి తిప్పవిభుఁడుగం
భీరగుణాంభోరాశియు । పారకృపామూర్తియైనపల్లి భక్షితిపతియున్, ౪౧.

వ॥ అందగ్రజుండు.

సీ॥ తనజయధ్వజ మారుతములు వైరికిరీటఖచితసన్మణిదీపకళలమలుపఁ
దనశిలీముఖములు ధ్రుతవిరోధిశిరోధి జలజశోణితరసాసవములానఁ
దన తేజములరాతి ధరణీశమదవతీ కబరికానిబిడాంధకారమడఁపఁ
దనవాహినీప్రౌఢి దర్పితప్రతికూలభూమిభృన్మదభేదమునఁ బరిఁప
రాజమాంధాతయనఁ బొల్చురసికలోక । సతతసంరక్షణాస్తోకజాగరూక
సవనవానందహృల్లగ్నసందగోప । బాలకుండైన తిప్పభూపాలకుండు. ౪౨.

సీ॥ అతఁడు రామప్రభుని బానెమాంబయందు । నాభశేంద్రునిలక్ష్మాంబయందు గనియె
జలజనయనుండురుక్మిణీజాంబవతుల । యందుఁ బ్రద్యుమ్నసాంబులనందినట్లు, ౪౩

క॥ వారలలోనధురంధరుఁ । డైరామన్నపాలుఁడమరు నమరపురంధ్రీ
చారుకరగ్రహలీలా । కారణదోరగ్రకుటిల కాక్షేయకుఁడై, ౪౪.

చ॥ హరిభజనప్రవీణుఁడగు నాధరణీంద్రుఁడు వైచమాంబికం
బరిణయమై తనూభవులఁ బ్రాజ్ఞులఁ దిమ్మనృపాలునోబధూ
వరువరదేంద్రుఁ దిప్పమహీ వల్లభుఁ బానెమరాజు వేంకటే
శ్వరునిలఁజక్రవర్తి సదృశప్రథితాత్ములఁ గాంచె నార్వురన్, ౪౫.

చ॥ అరయఁగ నమ్మహీవరుల కగ్రజుఁడై తగు తిమ్మరాజుని
ర్భరతరభాటి కాతురగ పాటనమూర్ఛితయాధరాతలో
ధరకిని రామయౌషధవిధానమునిర్జరవైద్యువేడఁగా
వరిగెడు లీలనద్భుతసమగ్రరజోవ్రజమేగునింగికిన్, ౪౬.

క॥ ధరనతఁడు రామనృపసో । దరియగు కొండాంబయందుఁ దనయునిఁ గాంచెన్
నరనుతు నైరవేంకటవిభు । హరిసిరియందతనుఁ గన్న యాకృతిదోఁపన్, ౪౭.

సీ॥ మిత్రగేహములనమిత్రగేహమ్ములఁ గనకసంఘాత మేఘునఁడు నిల్పె
ధర్మాగమమున సద్ధర్మాగమమునని ర్భరగుణారోపమేరాజు నర్పె

విగ్రహంబున భీమవిగ్రహంబున మహా విషమాంబకత్వమే విభుఁడు దాల్చె
గృతులయందు నిఖిలాకృతులయందు ననురాగి భరితవీక్షణమే నృపాలుఁడు నిచె
జగతి నేరాజుకు వలయోత్సవము నచ్చు । రాజు గావున నటు స్వీయరక్షచేత
గోరియ స్వార్థమగు జంద్రగుప్తి దుగన్ । మతఁడు విలసిల్లు వేంకటక్షితివరుండు. ౪౮

గీ॥ అతఁడు తిమ్మాంబయందుఁ దిమ్మావనీశుఁ । జిన్నతిమ్మప్రభునిఁ గాంచె సీతయందు
రవికులోద్ధారకుండైన రాఘవుంపుం । గరిమఁ గుశలవవీరులఁ గన్నకరణి. ౪౯

క॥ ఈసంతతిఁ దగుతిమ్మా । క్ష్మాసుత్రామునకుఁ గూర్మి సహజన్ముఁ డనన్
భాసిల్లు నోబనృపతి తా । నాసిరమహీజ వితరణగుణాస్పదుఁడై. ౫౦

చ॥ సరసనఖప్రసూన భుజశాఖలఁ జెంది వచోమరందమా
ధురి జెలువొంది కీర్తియను తోరపువాసనఁ బొదిసొంపునం
బరఁగు దళంబులం బ్రబలి పండితకీరపరంపరాఫల
స్ఫురణ మొసంగు నోబనృపపుంగవుఁ డాశ్రిత పారిజాతమై. ౫౧

ఉ॥ భూనుతశౌర్యుఁ డోబనృపపుంగవుఁ డుగ్ర రణోర్విభీమబా
హానిశితాసిధారనన తాహితకోటియఁ దస్తహస్తము
ల్బానిహరింపఁ దద్గళితభూరి సమున్నత ఖడ్గముల్పర
స్థానము చేసినట్లు మరు సాగెకు వారికనూర్ధ్వయాత్రకున్. ౫౨

క॥ అతఁ డోబళాంబయందు । ప్రతిమునినోబళనృపాలు రామమహీశున్
ప్రీతిఁ గాంచె విద్యయందు । ద్భుతధీనిధి వినయబోధములఁ గాంచుగతిన్. ౫౩

క॥ తదనుజుఁడు వరదభూపతి । సుదతినుక గాంచుఁ డమరుసురపురవనితా
విదితవరదానచాతురి । గదిసినయాత్మీయనామకము సార్థముగన్, ౫౪

వ॥ తత్క్రమంబున ౫౫

సీ॥ అవనినభోంతరంబాస్య రంధ్రము గాఁగ ఘనపక్ష్మమోముపై కప్పుగాఁగ
హిమశైల వింధ్యశైలములు కొమ్ములుగాఁగఁ బూర్ణచంద్రుండు మూపురముగాఁగ
శరధులు నాలుగు గొరిజపట్టులుగాఁగ నైలింపనదిగంగడోలుగాఁగ
వాసుకియాభీలవాలదండముగాఁగ దారకల్కింకిణీతతులుగాఁగ
గరిమఁ జెన్నొందు బసవశంకరమహాంక । మాజి నేరాజశేఖరుండావహించె
నతఁడు నిలువెల్ల మగఁటిమియనఁగఁ బరఁగు । రామవిభుతిప్ప శౌరి నిర్వారితారి॥ ౫౬

సీ॥ బలఘాతధూళిచేఁ బందిళ్లు సమకట్టి యహితరక్తము కలయంపిచల్లి
నసియుశౌర్యవితాన వితానములుగట్టి వివిధవాద్యధ్వనుల్వేలయఁజేసి

నిమతాస్థిఘటలచూర్ణముల ముగ్గులువెట్టి ద్వీపపరంపరలకుఁ బందొనర్చి
దళితారికుంభి ముక్తాఫలంబులసేస చల్లి ప్రతాపాగ్ని సాక్షిగాఁగ
మెఱయునే రాజువిజయలక్ష్మీవివాహ । విదితసన్నాహుఁడై యతఁడమరుగుండ
పిడికిఁగంతయు లేనిగభీర ఘోర । రణజయోత్సాహి పానెమరామవిభుఁడు. ౧౭

చ॥ అతనిసహోదరుండు చతురంబుధివేష్టిత భూధురంధరుం
డతులితశౌర్యభీకరభుజాగ్రుఁడు వేంకటరాజు వొల్చునా
క్షితిపతిదానవాసనలఖేచరశాఖిఁ దిరస్కరింపఁగా
వితతతదీయమన్యశము స్ఫుటమానలిమంజులాకృతిన్॥ ౧౮.

క॥ ఈవంశకర్తయగుతి । మ్మావనిపాలునకుఁ గూర్మియనుజన్ముఁడు దా
నై వెలయు వల్లభక్ష్మా । శ్రీవల్లభుఁ డఖిలరాజతేజోనిధియై॥ ౧౯.

సీ॥ కమలాప్త కమలాప్త కమలాప్త సన్నిభుండే విభుండురుచిపరిభావదయల
గోరాజ గోరాజ గోరాజ సంకాశుఁడే రాజు మతిభోగగౌరవముల
హరిపుత్ర హరిపుత్ర హరిపుత్ర సదృశుఁడే ధన్యుఁడు జయరూపధ్యానవిద్యల
నాగారి నాగారి నాగారికల్పుఁడే మేటిప్రాభవవేగపాటవముల
నతఁడు సువిచారుఁ డవికారుఁ డనఘుఁ డలఘుఁ డప్రమేయుఁ డజేయుఁ డతిప్రతాపుఁ
డప్రతీపుఁ డనేకలోకాభినంద్యచరితుఁ డింపొందు వల్లభక్ష్మావరుండు, ౨౦

ఉ॥ వల్లభరాజశౌర్యగుణవైభవ మెన్న విచిత్రమన్వహో
వల్లభువైరిరాజి వనవాటికనుండి నిజాంబుజాస్యత
స్వల్లభయంబుఁ బిల్వఁగన వార్యతదుజ్జ్వలనామ సంస్మృతిం
బెల్లువడంకుఁ గాంతపయిప్రేమము గొంతనెపంబు సేయుచున్. ౨౧.

క॥ అతులప్రతాపుఁ డాభూ । పతిసోల్లైవేరియంపుఁ బ్రబలుఁ డిమ్మ
క్షితిపాలునిఁ గాంచె౦బశ । పతిపార్వతి యందు గుహునిఁ బడసినభంగిన్. ౨౨

సీ॥ భోగిమట్టినవానిభోగిఁ జుట్టినవాని భోగిఁ బట్టినవానిఁ బోల నేర్చుఁ
దమ్మిఁ దాల్చినవానిఁ దమ్మి నొల్చినవానిఁ దమ్మి మొల్చినవానిఁ దారసించు
మృగము నుంచినవానిమృగముఁ ద్రుంచినవాని మృగముఁ బొంచినవాని మీఱఁ జాలుఁ
గొండ నొక్కినవానిఁ గొండఁ బెక్కినవానిఁ గొండఁ ద్రొక్కినవానిఁ గొదవ సేయు
భరణభూతిజవప్రభా బాహుశక్తి । మతికళాశౌర్యసత్యసంభృత్వవిభావ
భోగగాంభీర్యగుణములఁ బుడమి నేర్పు । పాంకులు సాటి యాతిమ్మపార్థివునకు. ౨౩

సీ॥ అతఁడు గంగాంబయందౌబళావనీంద్రు| మూర్తిఘను సింగవిభుఁ గాంచెఁ గీర్తివిభుల
నత్రియనసూయయందుఁ మున్నబ్జగర్భ|కమలనాభకపర్దులఁ గన్నయట్లు, ౨౪.

ఉ॥ వారలలోఁ గభీరగుణవారిధి వారిధిప జ్జీర్తిలో సుధా
వారిధిఁ బోలె భూమిధరవర్గములోఁ గనకాద్రివో లేవో
స్సారముపీరముం దెగువ సత్యము శౌచము సద్విచారమా
చారము గల్గి పొల్చె బుధసన్నుతుఁడౌబళరాజు ధన్యుఁడై. ౨౫.

సీ॥ అప్పపాలైన శుభాబ్జంబు రుచి యెంత మాట మోచిన యంచ పేటయెంత
నీళ్లు మోచిన భవానీభర్త కలిమెంత బిలము దూరిన శేషు బలిమి యెంత
తమ్ములతోఁ బోరు తారేశు కళ యెంత తృణమైన శరపుంజదీప్తి యెంత
పండ్లు గిలించు కల్పకశాఖి వళమెంత విరిసిన మల్లెపేఁక యెంత
యనుచుఁ దనకీర్తిధవళాబ్జహంసమదన|మథనవరభోగివిధుశరామర్త్యకటిపి
వికచవిచికిలమాలికావితతిఁ దెగడ | వసుధఁ బాలించునౌబళభూవల్లభుండు. ౨౬.

ఇతని వైరులు వనప్రతతిలోఁ గాఁపుండ నస్వర్థనైధాత్రి యవని యయ్యె
నితఁడంతరీపంబు లేలముద్రాస మున్న ద్రుఁడై జలధి సముద్రుఁడయ్యె
నితని యూలను చూచి యెల్లవేల్పులు నిమేషము మాననని మేషసంజ్ఞఁ గనిరి
యితని సేనాధూళి హిమసేతువుబు గప్ప గౌరీశుఁడే పుడంధకారి యయ్యె
నితని కరుణాంబురాశిసంభృతతరంగ | సంగతంబైన మనమున సంచరించి
శౌరి నారాయణుండయ్యె జగతి ననుచు | సుకవులు నుతింతు రౌబళక్షోణివిభుని, ౨౭.

వ॥ తత్క్రమంబున. ౨౮.

సీ॥ చతురాననాధిక శ్రుతిహితశీలుఁడై విబుధాన్నదానప్రవీణుఁడగుచు
వసుమతీభారధూర్వహుఁడై నృసింహతాధాత్రిజగాయె బలిశరోరత్నమగుచు
నర్జునకరగర్వహరణసత్కీర్తియై యతనుశాస్త్రవధర్మ హరియగుచుఁ
గామపాలాఖ్యుఁడై గరిమసర్వజ్ఞుఁడై నరవరోత్కటమైన నడతయొకటిఁ గి
శౌరిబరూప విహరణశ్రమముఁ జెంద| లేక యున్ని గుణంబులు నేకమూర్తి
యందు నిరవొందఁ జేసినయట్లు వొల్చు| మూర్తి నిర్జితరతిరాజు మూర్తిరాజు. ౨౯.

చ॥ చిరతరకీర్తి మూర్తి నృపశేఖరుఁడాహవదుర్నివారి భూ
వరులఁ గరాగ్రలోకకరవాల ముఖమ్మున గ్రుచ్చి యెత్తుఁ ద
ద్వరవధూభిలాషయుతనాకవలోకవిలాసినీగణం
బంటుని వారువల్లభులు పట్టుమటంచు సాగ కైవడిన్. ౩౦.

సీ॥ గురువనీపకులకాదరమొప్పఁగొంచనియొసఁగియుఁగొండనియొసఁగకుండు
నమితలావణ్యలీలావాప్తివేమారుఁ గినిసియు వేమారుఁగినియకుండు
సత్కీర్తిచేసుధాకర దేవసరసులనాడియుసరసులనాడకుండు
నరులపైనిశితసాయకపఙ్క్తిచేపట్టివిడచియుఁజేపట్టివిడువకుండు
ఫణిపతికైనభారతీపతికినైన । బహుపతికైననలబృహస్పతికినైన
నవనినవలీలఁబొగడంగనలవిగాని। చరితములఁబొల్చునాసింగజనవిభుండు ౨౧

చ॥ చకచకమించుసింగనృపచంద్రునిశాతకృపాణవల్లిలోఁ
బ్రకటవిరోధియూధరథభద్రగజాశ్వనమూదినీకదం
బకములుగానవచ్చుసుభప్రతిబింబితమూర్తులై మహా
జికలితసాధ్వసోదయముచేనసిగచ్ఛముఁబొచ్చెనోయనన్, ౨౨

గీ॥ ఇట్లుసుగుణాభిరాములైయొనయుమూర్తి। ఘనుడుసింగక్షితీంద్రుఁడుఁదనుభజింప
నెలకొనుభీమార్జునులుగోవ్వసించుప్రవీణు। ధర్మసుతుమాడ్కిఁదగునోబధరణివిభుఁడు.

సీ॥ ఘనభుజాశౌర్యరాఘవుఁడు రాఘవదేవధరణీశుఁడేరాజతాతతాత
నరసుతుఁడైనపిన్నమరాజు సౌజన్యధన్యుఁడేరాజన్యుతాతతండ్రితండ్రి
యమితవైభవుఁడైనయార్వేటిబుక్క భూతలనాథుఁడేరాజుతండ్రి
యసమానదానవిద్యాధురంధరుఁడగు రామరాజేంద్రుఁడేరాజుతండ్రి
యట్టిసోమాన్వయాబ్ధి శీతాంశుఁడనఁగ। నమరుశ్రీరంగవిభుఁడుపుత్రిగనైచెలంగు
లక్ష్మమాంబనువరియించెఁ లితశీల। నమ్మహాసాధ్విసోదరు లధికయశులు, ౨౩

క॥ కోనక్షితిపతితిమ్మమ । హీనాథుఁడురామ నృపతిమొఱతిమ్మధరా
జానియును వేంకటేంద్రుఁడు। భూనాయకతిలకులగుచుఁబొల్తురుఘనులై, ౨౪

వ॥ అందగ్రజుండు.

సీ॥ లాటీకుచాభోగపాటీరపంకంబు బోటీముఖాబ్జకర్పూరకలన
గౌళీనవీనాంకపాళీదుకూలంబుచోళీకుచాళీప్రసూనరాజి
యంగీముఖాభంగసంగీతవాణికళింగీవిలాసకేళీమరాళి
భోజీకరస్వచ్ఛరాజీవ కాంతికాంభోజీమహాహీరముకురరేఖ
కుంతలీకర్ణచామరక్తికకుండలప్ర। కాశమెవ్వానియభినవాకాశదేశ
చంద్రికాయితసత్కీర్తిజాలమతఁడు। ప్రబలుశ్రీరంగవిభుకోనపార్థివుండు, ౨౫

వ॥ తదనుజుండు. ౨౬

శా॥ శ్రీరంగప్రభుతిమ్మశౌరిభుజకాక్షేయంబుచేనాజుల
న్వీరారాతులఁద్రుంపఁగాక్షితి పవుత్వేవేగమార్తాండసం

ఝూంగందూరఁ దదీయమండల సముద్ధూతవ్రణశ్రేణికి
స్నీరంధ్రాప్రపథభూతాకాభాతిఁ బగు నెంతేఁ దచ్ఛమూరేణువుల్, ౭౮.

వ॥ తత్క్రమంబున. ౭౯.

సీ॥ ఖలుఁడతిద్రోహి సల్కాయి తిమ్మని హరించి సకలకర్ణాటదేశంబు నిలిపె
నతుని వర్ధితుని వత్సుతుని బట్టముఁ గట్టి కుతుపశమల్కానక్షోణి నిలిపెఁ
బదిలుఁడై రాచూరుముదిగల్లు గప్పంబు సేయఁగాంచ సపాదుసీమ నిలిపె
శరణన్న మల్కానిజామునికభయంబొసంగి తదీయరాజ్యంబు నిలిపె
నవనియంతయు రామరాజ్యంబు సేసెఁ । దనగుణంబులు కవికల్పితములు గాఁగ
నలవి యొరచింప సత్కావ్యములను వెలయ । భూమి నొక రాజమాత్రుఁడే రామవిభుఁడు

సీ॥ ఖరదూషణాఖర్వగర్వనిర్వాపణం బాజి నెవ్వాని సాయకనికాయ
మధికతారావరాహంకారవారణోద్వేలమెవ్వని యకోపచులకోభ
వివిధారికామినీవిఘటనాటోపమేయ వనిశాఘోషఘరాషిరేఖ
ప్రౌలస్త్యనిరసన ప్రౌఢిమాఘాంకితం బె రాజు చారిత్ర చారుభూతి
యతఁడు కలియుగ సర్వరామావతార । చారుతానాథనామప్రచారుఁ డగుచు
వెలయు బ్రహ్మాండఘటికావిటంకి త్రిధనుఁడు శ్రీరంగరాజు రామధరణిధవుఁడు ధాత్రి

సీ॥ తనభుజాదండకోదండమఖండమై యనువేళఁ శరవృష్టి నాచరింపఁ
దనహేతిశతకోటిఘనధాళధళ్యమై ప్రతిపక్షబలభిదాపటిమ నెఱపఁ
దనవిగ్రహంబు సజ్జనమనోహారియై మంజుఘోషాశ్లేషమహిమఁ జెలఁగ
దనవైభవంబు సంతానసమగ్రమై సురభిసంభృతగుణస్ఫురణఁ బెంప
రాజదేవేంద్రుఁ డితఁడనఁ దేజరిల్లు । ననఘచాళుక్యనారాయణాంకవివిధ
విరుదమన్నె భాళాదివిరుదశాలి । ప్రాభవోపేంద్రుఁ డౌ తిప్పపార్థివుండు, ౮౨.

సీ॥ అసురారిరాణి నేనధివసించుటయెట్లు బహువిధాసురవంశభవులయందు
సుకలోకమును సోదరి నేను నిలుచుటెట్లు కటకట గోఘాతకులయందుఁ
బైత్రిలోక్యమాత నేఁ బగిలియుండుటయెట్లు త్రైలోక్యకంటకోద్ధతులయందు
దేవతారాధ్య నేఁ దిరముగాఁ దగుటెట్లు కడు దేవతాద్రోహకరులయందు
ననుచు యవనులఁ దొలఁగి తన్నాశ్రయించు । వారిసామ్రాజ్యలక్ష్మి నెవ్వాఁడు గొనియె
సాహవోగ్రబరిద సప్తాంగహరణుఁ । డలఁడు విలసిల్లు శ్రీవేంకటాద్రివిభుఁడు,

మ॥ ప్రతికూలావనిభృద్విభేదనకళాపారీణమై సంగర
స్థిరిలో వేంకటరాజశేఖరుని శౌర్యంబు ఖ్యాత్యాధిక

మతిఁ జెన్నొందఁ దదీయధారఁ బడి కాకోలాళి పుల్యావన
క్షితిపుల్గాంచిరి నాకలోక వనితాశృంగార సాంగత్యముల్, ౨౪.

మ॥ బలధుర్యుండగు వేంకటేంద్రుని మహాబాహాబలాటోపవి
హ్వలుఁడై యున్నతి ధారవ్రియాసహదాభిఖ్యుఁడైనట్టి యే
మహాఖ్యానుఁ డిదానేఁ డూఁ గ్రమ్మఱ సహాయుండయ్యె నానర్థిలిం
దలఁదత్పాదముఁ దాల్చె భమరధిపాంతంగా ననిత్యోన్నతిన్, ౨౫.

మ॥ స్థిరసంగ్రామజయాభిరాముఁ డగు నా శ్రీవేంకటక్ష్మావరుం
డరయన్ రాజశిఖావతంసుఁ డగుచు దధ్యంబుర్వింగాకున్న నీ
ధరణీపాలకు లెల్ల మెచ్చఁగ సహస్రక్షోణి శిష్ట్యాప్తి ప్రతిష్ఠా
సురదుర్గాధిపతిత్వవైభవభవస్ఫూర్తిన్ విజృంభించునే, ౨౬.

క॥ ఈరాజముఖులసోదరి । గౌరాజిలులక్కమాంబ యమృతాశనధా
త్రీరుహములకైదింటికి । నారయఁగోఁ బుట్టువగు రమాంగన పగిదిన్, ౨౭.

సీ॥ ప్రతివచ్చునన్న పూర్ణాచేవిభైక్ష్యాన్న మిడక సంయమిఁ బల్కుఁ బకున్నఁ
బాటిసేయఁగవచ్చు భాగీరథినభంబు ముట్టి పైనాఁగ రైయె మొరయకున్న
సరివచ్చు భూకాంత సకలప్రజాధార పూర్ణ సహాత్వంబుఁ బూనకున్న
రూపింపవచ్చు నరుంధతి నెప్రోద్దుఁ దనయుప్పభోవంబు దాల్పకున్న
నిమ్మహాసాధ్వికనిజను లెల్లఁ బొగడ । నలరు నోబక్షితీశునర్ధాంగలక్ష్మి
బాంధవావనధుర్యవైభవకదంబ । లలితసద్గుణనికురుంబ లక్కమాంబ, ౨౮.

క॥ పౌలోమికి నింద్రసనకుమ । హాలలితాకృతిజయంతుఁ డాత్మజుఁ డైన
ట్లాలక్కమాంబకోబన్న । పాలునకును నృసింహధరణిపతి జనియించెన్, ౨౯.

సీ॥ కాశ్యపితా నాఁటఁ గశ్యపోద్భవుఁ డైన కాకోదరస్వామిఁ గిలయఁ బెట్టు
ధాత్రియాతనపయోధారచేఁ జెరిగిన కమఠకులాధీశుఁ గవయఁ బెట్టు
తగ ధేనువగు వేళఁ దణ్ణాకంబగు ధరాధరశిరోమణిఁ గూడఁ దలఁచు పెట్టు
తనకయావిర్భవించిన పంచనామహాక్రోడ బుతోఁ గూడియాడు పెట్టు
తగవు గాదంచు ఫణికూర్మధరణిధవ । రాదిమాదారములమాని యవనికాంత
దనభుజాదండమున నుండఁ దనరుచుండు । సరసగుణహారి యోబయనరసశౌరి, ౩౦.

క॥ అతఁ డిల రామయతిమ్మ । క్షితిపలిసత్పుత్రుఁ డగుచుఁ జెలువొందు గుణా
న్వితుఁ డగు తిరుమల ధాత్రీ । పతితనయం దిమ్మలాంబఁ బరిణయ మయ్యెన్; ౩౧.

సీ॥ పొలుపగు నేసాధ్వి భుజవల్లి రుక్మిణి సత్యయే గరిశవాచావిశుద్ధి
జనకనందినియే విశాలాక్షి చుతిరేఖ భద్రయే మగువ శోభనవినీతి
యనసూయ యేకటు-బినిద్రిష్టి సర్వ మంగళ యే శుభాంగనలలితరీతి
ధృతిసుదక్షిణయే పతివ్రతకరుణ సంపత్కాంతయేయింతిభవ్యనూతిఁ
యట్టిగుణధన్యయైతనయాత్త్రయెల్ల । నఖిలపతిదేవతాసంగ్రహంబనంగ
నలరునలవీరవల్లి తిమ్మానిసీంద్ర । శరధిమందారవల్లియై తిరుమలాంబ, ౯౩.

గీ॥ అమగువ గుంచుమనరసింహాభూమిభుఁడు । రసికసారంగ రాజు శ్రీరంగరాజుఁ
గనియె నసఘుని దేవకీకాంతయందు । ఘనుఁడు వసుదేవుఁడచ్యుతుఁ గన్నపగిది.

క॥ అతఁడుభయవంశపావనుఁ । డితఁడనబాలార్కవిజయహేవాకవిభా
వితతిఁ యుసమందమంద । స్మితసంప్రాతపముబాల్చు శ్రీరంజితుఁడై, ౯౪.

సీ॥ ఘనతఁజేపాంపవేర్చిన నాఁటనుండి ఘనీ శ్రుతులమీఁదఁ జేఁజాఁపనేర్చె
ననయంబు వడుగు పెట్టిన నాఁటనుంచి ఘనరిశిరంబులమీఁద నడుగుపెట్టె
నవనీతముగ్రసించు నాఁటనుండియు సాత్త్వికలయశోనవసీతములు గ్రసించె
నవపాంసుగతిఁ జెందు నాఁటనుండియు ఖిలఘాటీపాంసుకేళిఁ జెందె
నిలువ నేర్చిననాఁట నుండియుఁ బరోధి । నృపతి సేనాపతుల గెల్చి నిలువ నేర్చె
నరసవిభుని సిరంగభూనాథవిభుఁడు । బుట్టెఁ బ్రబలుచు నున్నాఁడు ప్రబలఁగలఁడె

వ॥ ఈకుమార నారాయణుం గాంచిన రాజన్యపుంగవునకు, ౯౫.

క॥ ఏతాదృశగుణమణిశేవధి । రాతలపరి పూర్ణకీర్తిహారమణికి జలధి
వ్రాతవృతధరణభరణస । మాతతనిజభుజభుజంగమగ్రామణికిఁ, ౯౬.

క॥ ధన్యునకుఁ బరణికులమూ । ర్ధన్యునకు నిజప్రతాపనిరస్తవదాన్యం
మన్యునకరాతినృపప । ర్జన్యనిబంధనవిశేషశతమన్యునకుఁ, ౯౭.

క॥ అజరగజరజతరజనిక్రు । దజతనుజన్యకుజపురజిదభుజగగజభు
గ్ద్విజవిజయినిజయశోమయ । సుజననుతధ్వజునకధికశోభానిధికిఁ, ౯౮.

క॥ గండరగండనికభినవ । మండలికాఖండమన్నెమార్తాండునకుఁ
జండప్రతాపవిహితా । జాంపునకున్లోభిమన్నియరగండనికిఁ, ౯౯.

క॥ లక్ష్మాంబానందనునకు । దిక్కాంతాచికురనికరదీపితకుసుమ
స్రక్కాంతదంతురయశో । ధక్కానిధికహితకరిఘటాభీమునకుఁ, ౧౦౦.

క॥ నాధేయగోత్రసవనధు । రాధేయునకఖిలసుకవిరాజికళాధా
రాధేయదానవిద్యా । రాధేయునకునుధరామరవిధేయునకుఁ, ౧౦౧.

క॥ గర్వితబలదసేనా । సర్వస్వహరానివార్యశౌర్యునకుఁ గమి
ఠోర్వీశసపాదభయదా । ఖర్వమహావిజయభేరికాభాంకృతికిన్. ౧౦౨.

క॥ పీనసమల్లస్థాపన । మానితకరుణాప్రసంగమాంగళ్యునకున్
ధీనిధికిస్పృహరివరణ । ధ్యానవిధానావధానధౌరేయునకున్. ౧౦౩.

క॥ తోరగంటిదుర్గరాజ్య । స్థిరసింహాసననివాసదీక్షానిధికిన్
వరయంత్రమత్స్యభేదన । బిరుదోద్దండునకు గండభేరుండునకున్. ౧౦౪.

క॥ ప్రతిదినకనకవసంతా । ర్జితకృతికాంతునకుఁ బురగరేవంతునకున్
గ్రతుపురనారాయణగృహ । వితతప్రాకారఘటనవిఖ్యాతునకున్. ౧౦౫.

క॥ అరుణారుణకరుణారస । పరిణామసమగ్రనయనపద్మాభునకున్
శరణాగతభరణాపర । నరసింహునకోబశౌరి నరసింహునకున్. ౧౦౬.

వ॥ అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యిమ్మహాలంకారప్రబంధం
బునకు నాదికారణంబగు నాయకగుణవ్రాతం బభివర్ణించెద. ౧౦౭.

## నాయకగుణములు.



క॥ కులము మహాభాగ్యమును । జ్వలితయుదారతమహోజ్జ్వలతధర్మా
కలనయు వైదగ్ధ్యయును న । నిలనాయకగుణము లెనిమిదేర్పఱుతుర్, ౧౦౮.

క॥ వీనికిలక్ష్యము లెల్లను । శ్రీనరసింహప్రభుపేరఁ జెప్పెద నేమి
న్నానావిధయుక్తిసూచిత । నానావిధపద్యగుంభనసమగ్రముగాగన్, కులీనత ౧౦౯.

సీ॥ ఏవంశమునఁ బుట్టెఁ బావనశ్రుతిధర్మ సర్మకర్ముఁడైన మనునృపాలు
డేవంశమునఁ బుట్టె నింద్రాదులరుదంద సత్యవాదిన హరిశ్చంద్రనృపతి
యేవంశమునఁ బుట్టె నిలఁ జతుర్దశలోక రక్షణక్షముఁడైన రావణారి
యేవంశమునఁ బుట్టె నిహపరాద్భుతపుణ్య చరితధుర్యుఁడు చోళచక్రవర్తి
యట్టియింపుగ్రహాదిసేనాధిపత్య । సత్యయుతుఁడైన భానువంశమునఁ బుట్టి
పరఁగుభూపాలసింహునోబయనృసింహుఁ । దలఁపఁగఁ గలికాలదోషంబు దొలఁగుటరుదే

వ॥ మహాభాగ్యము,

మ॥ ప్రకటాంఘ్రీలబ్ధగోధిసైన్యములఁ ద్రుంపం జాలు నాక్రాంతసే ౧౧౦.
వకుఁ డేమాత్రగ్రాహి శౌర్యయుసమద్వైరిక్షితీంద్రార్పితా

ధికవేసండహయాన్వితంబులు భుజాదీప్తాంగదంబుర్విభా
గ్యకళావైభవమెన్న శక్యమె నృసింహక్ష్మాతలస్వామికిన్, ౧౧౦

ఔజ్జ్వల్యము—

మ॥ స్థిరసోమాన్వయదుగ్ధవార్ధి జనియించె న్వేంకటాద్రీంద్రభూ
వరచంద్రుండు తదీయసోదరి రమావామాక్షిలక్ష్మాంబయై
పరఁగెం దద్వనితాశిరోమణికి నోబక్షోణిపాలేంద్రుశ్రీ
నరసింహాధిపుఁడై జనించె మరుఁడౌన్నత్యంబు దీపింపఁగన్, ౧౧౧

ఔదార్యము—

సీ॥ అలబలీంద్రునిచేత నడుగు పెట్టఁగనేర్చి ధారాధరముచేత నీరువోసి
కానీనుచేఁ గంచుకముఁ బూనఁగానేర్చి యొలమిదధీచిచే నెముకబలిసి
క్షీరాంబురాశి ద్రచ్చిన వెన్న నీడేరి నైలింపగవిచన్ను పాలఁ బెరిగి
కల్పపాదపఫలోత్కరములఁ జవిగాంచి వనజారి నెమ్మేనఁ గనఁగి పెనఁగి
ధరణిఁ బ్రోదివహించిన దానకన్య। సకలయాచకబాంధవు ల్సన్నుతింప
నీకరగ్రహణావాప్తి నెఱసెనౌర। సరసగుణహార యోబయనరసధీర॥ ౧౧౨

తేజస్విత—

సీ॥ బహుతరాశాభ్రాంతి బయలుప్రాఁకకయున్నఁ గువలయద్వేషంబు గోరకున్న
మీటితమ్ములవిరిపోటు సేయకయున్న వారుణీసక్తిఁ గ్రాఁగకున్న
జగతినందఱకును బగలోర్వకయున్న దోషాభిభూతుఁడై తొలఁగకున్న
ద్విజరాజపరిభవోద్వృత్తిచే కొనకున్న సరసుల నింకింపఁ జాలకున్న
సాటియగు విశ్వవినుతశశ్వత్ప్రతాప। వైభవధ్వస్తదుర్వారవైరివీరుఁ
డైన యోబయనరసింహుఁ డమితభువన। భవనభృతతేజమున కబ్జబాంధవుండు॥

ధార్మికత్వము—

చ॥ పలుకుట సత్యవాసనక పారవిరోధి జయోత్సవంబు దా
నలఘుయశోధనంబు కొఱకంబుధివేష్టితభూపరిగ్రహం
బలరు నగణ్యపుణ్యచరితాచరణంబున కాత్మజీవనం
బలసుజనావనంబు కొఱకా నరసింహనృపాలమౌళికిన్, ౧౧౪

వైదగ్ధ్యము—

సీ॥ వనజారికళలచేఁ దనివినొందించిన నిలఖేచరుఁడు ప్రాణమిత్త్రననిన
వసదంబు తనదుజీవనమెల్ల నొసఁగిన నెమ్మేను శిబి కోసి కొమ్మటన్న

సీ॥ బ్రహ్మానే సొమ్మొలిచ్చిన సురమణి మిన్నందితలఁపులో మెలఁగుచున్నఁ
జేరి పాదము బలిశిరసావహించినఁ బాథోధి దానెంత భంగపడిన
వారినెవ్వారిఁ గాదని వసుధ నారఁ। నిక్కముగఁ గీర్తికామిని నీకు దక్క
నీదు వైదగ్ధ్యగుణము వర్ణింపవశమె। నరసుతాటోపతోరగంటినరసభూప. ౧౧౫

క॥ అనయము నాయకసుగుణము। లనేకములు గలవు వాని నతివిస్తరభీ
తినిరూపింపఁగ లేనిఁక। ననుపమ నేతృస్వరూప మభివర్ణింతున్. ౧౧౬

## నాయక స్వరూపము.

క॥ కీర్తిప్రతాపసుభగుం। డార్తావనుఁ డఖిలగుణగణాఢ్యుఁడు భూపా
వర్జితభూభరుఁడై పరి। కీర్తితుఁడగు భూషణగావ్యగీతప్రియుఁడై. ౧౧౭

కీర్తిప్రతాపసుభగత్వము.—

మ॥ అరినిర్భేదనధుర్యయోబయనృసింహా సింహాసనాధ్యాసీ
న వరసత్కీర్తిమరాళబాలికభవద్వర్తిష్ణుశౌర్యప్రభా
భరితారుణ్యముఖాగ్రయై పరఁగుచుంబాల్నీడునేకంబుగా
థరఁగావించు సమస్తవిస్మయకళాడానప్రవీణోన్నతిన్. ౧౧౮

ఆర్తావనత్వము.—

మ॥ ఒకప్రహ్లాదుని నార్తుఁగాఁ జిటిమదీయోత్సేకమే కావన
ప్రకటంబౌనెయటంచుఁ దా బహుతరార్తత్రాణపారాయణో
త్సుకతన్నీ నరసింహుఁడుర్వి నరసక్షోణీశుఁడై పుట్టెఁగా
కొకభూపాలునకిట్టియార్తభరణోద్యోగంబు వాటిల్లునే. ౧౧౯

గుణాఢ్యత్వము—

చ॥ అరయఁబయోధిపాత్రమును నంజనశైలము కజ్జలంబుఁ ద
త్సురతరుశాఖ లేఖినివసుంధర పత్రముఁ జేసి వేడ్కతోఁ
గొరలి విరించి గేహిని లిఖించినఁ బారము వొందదౌరమా
నరసనృపాలమౌళి సుజనస్తుతసద్గుణసంప్రదాయముల్. ౧౨౦

భూభరణము.—

చ॥ విపులఫణాసహస్రమున వీఁక ధరింపఁగ నేని శేదిని
న్నిపుణత బాహుపీఠమున నల్లె నృసింహుఁ డటంచుఁ బన్నగా

ధిపతినిరంతరాద్భుత మతిందలలూఁచ భుజరావిపాండురు.
డెపుడుఁబురాణభోగియనియెన్నుదురాభుజగేంద్రునందయుక్. ౧౨౧

కావ్యగీతప్రియత్వము.—

మ॥ నరసింహుండభిషేకవీరరససన్నాహంబు ఘాటించియుం
గరుణాకోమలుఁడై రమావిమలశృంగారార్ద్రుఁడై పొల్చుచా
తురిసాహిత్యజమర్మకర్మకథనోద్యోగాఢ్యుఁడయ్యున్నీ
నరసింహేంద్రుఁడనూనగానరససంధానప్రియుండెంతయున్. ౧౨౨

మ॥ అమరక్ష్మాధరధీరధీరచితకార్యారంభరంభాసమ
ప్రమదాభవ్యమనోనురాగఘటనాపాంచాలపాంచాలగా
ళమఖోర్వీనుతశౌర్యశౌర్యవనలీలాలోలలోలాభవ
ద్రమణీయాగమధర్మధర్మతనయప్రఖ్యాతసత్యవ్రతా. ౧౨౩

క॥ కుటిలారిభయదధాటీ। పటుపటహాధ్వమన్నినాదపరిపాటితదిక్
తటపటలచటులమేధా। పటిమపరాభూతభూతపతిమణిహారా. ౧౨౪

మాలిని॥ అలఘునయవిహారా హారనీహారతారా
హలధరరుచిధారా హారకీర్తిప్రచారా
జలధివరగభీరా జైత్రకాక్షేయధారా
లలితగుణవిచారా లక్కమాంబాకుమారా.

గద్యము.

ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంకుశ
ప్రతిభాబంధుర ప్రబంధ పరనరచనాధురంధర ప్రబంధాంక
వేంకటరాయభూషణసుపుత్త్ర తిమ్మరాజపౌత్త్ర సకలభాషా
విశేష నిరుపమావధాన శారదామూర్తిమూర్తి ప్రణీ
తంబైన కావ్యాలంకార సంగ్రహంబను మహాప్ర
బంధంబునందు నుపోద్ఘాత ప్రకరణంబును నా
యకగుణవర్ణనంబును నాయక స్వరూప
కథనంబు నన్నది.

ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# నరసభూపాలీయము.

## కావ్యాలంకారసంగ్రహము ద్వితీయాశ్వాసము.



క॥ శ్రీరాజితసదనకలా । ధారనిరంతరతరార్థిజ దారిద్ర్యహరా
నారాయణ చరణార్చన । నారీజనతారతీశ నరసక్షితీశా, ౧.

గీ॥ అవధరింపుము లక్ష్మలక్ష్యముల నెల్ల । ననఘ భవదీయనామధేయాంకితముగ
బహువిభక్తుల నొనరింతుఁ బద్యవితతి । నిచట నాయకభేదంబు లెట్టులనిన, ౨.

క॥ ధీరోదాత్తప్రముఖులు । ధీరోద్ధత ధీరశాంత ధీరలలితుని
ధారుణి నలువురు నాయకు । లారయఁ దల్లక్షణంబు లభివర్ణింతున్, ౩.

శా॥ ధీరాత్ముండవికత్థనుండు గరుణోర్వేలుండు సత్త్వాఢ్యుఁడా
ధీరోదాత్తుఁడు శౌర్యదర్పకుహనాధీనుండు ధీరోద్ధతుం
డారూఢిన్ సమధీ ప్రసన్నుఁడు ద్విజుం డౌ ధీరశాంతుండు వి
స్ఫారింబోలిన భోగి ధీరలలితుండై పొల్చు నిశ్చింతతన్, ౪.

ధీరోదాత్తుఁడు.—

సీ॥ చలిచీమ నేనియుఁ జాఁ ద్రొక్కఁగాఁ జాలఁ డేరీతి గెల్చెనో వైరివరులఁ
గలనైన నిజవర్ణనలు సేయవినఁ జాలఁ డెట్లందుకొనియెనో కృతిచయంబు
చెలువొందు నాకారచేష్ట లెయ్యెడఁ గానఁ డెట్లు నవ్వెనో యాత్మహితులతోడఁ
బరుషాక్షరంబులు వలుకఁ డెక్కాలంబు నెట్లు భర్జించెనో హీనమతులఁ
బరులఁ జేపట్టఁ డెలమిఁ జేపట్టి విడువఁ । డలయఁ డేమఱఁ డరినైన నవగుణంబు
లెన్నఁ డోబయ నరస ధాత్రీశతిలక । మరయ నరలోకభాగధేయంబు గాదె, ౫.

ధీరోద్ధతుఁడు.—

మ॥ బలవద్వైరి భిదామహాభిరతి మైభవ్యప్రతాపోజ్జ్వల
జ్వలనజ్వాలజటాలమై రణభయవ్యాసక్తతత్తన్నరో
జలజాంధంకరణప్రగల్భమహనాసంపాటియై పొల్చుఁ దా
నిల ధీరోద్ధతవృత్తియై నరసధాత్రీశాగ్రణి ద్ధబసిన్,

ధీరశాంతుఁడు.—

చ॥ ఇనకులధుర్యుఁడైననరసేంద్రునిచేతఁ బ్రతిష్ఠితంబులౌ
ననఘమహాగ్రహారములయందలిభూసురకోటిమేటియై
ఘనతరశాఖలం జెలఁగికాంతశుకక్రమమై మెలంగున
య్యనిమిషభూజవాటిక్రియ నాత్తశుచిప్రసవాభిరామమై. ౯౭

ధీరలలితుఁడు.—

ఉ॥ కుంతలగౌళచోళకురుఘూర్జరహూణశకాదిమేదినీ
కాంతులు సంతతంబునిజగాథ బలశ్రుతిమాత్రభీతులై
యింతులరత్నహారములనెల్లధనంబులనిచ్చికొల్వని
శ్చింతతఁదాల్చునోబయనృసింహుఁడుభోగకళాప్రవీణుఁడై. ౯౮

గీ॥ మఱియుశృంగారలీలాసమగ్రయోగ్య। తానిశవిచక్షణులుదక్షిణానుకూల
ధృష్టశఠులనఁగాంతులభీష్టమతులు। గలరుతల్లక్షణంబులు దెలిపిపలుతు. ౯౯

చ॥ చెలఁగుబహుప్రియాసదృశశీలుఁడుదక్షిణుఁ డొక్కకాంతకే
వలచిగుణాభిరాముఁడగు వాఁడనుకూలుఁడుసాపరాధుఁడై
యలుకనివాఁడుధృష్టుఁడు ప్రియాశయమాత్రనివేద్యవిప్రియుం
డలశఠుఁడంద్రుపేరిటకుదాహరణంబులునిటఁ యించెదన్. ౧౦౦

దక్షిణుఁడు.—

ఉ॥ సాగరమేఖలాసతికిఁ జారుభుజా పరిరంభ మిచ్చెవా
ణీగగనావలగ్నకును నేర్పుమెయి న్నొసగమిచ్చెవీరల
క్ష్మీనగజరాజగామినికి మేయభుజాంతరమిచ్చెసంతత
త్యాగినృసింహభూవిభుఁడె దక్షిణనాయకుఁ డెన్నిభంగులన్. ౧౦౧

అనుకూలుఁడు.—

చ॥ కనకము లంబరంబులును గ్రామములుజ్జ్వలదివ్యరత్నమం
డనములువాజివారణఘటల్ఘనసారసుగంధసారము
ల్దనివిదలిర్ప వేఁడినకొలందినొసంగుచు నోబభూపనం
దనుఁడగు నారసింహుఁడిల దావరమాప్రియుఁడయ్యె నెంతయున్. ౧౦౨

ధృష్టుఁడు.—

చ॥ ఉరమున నున్న కుంకుమము దుజ్జ్వలకోవ...హాయవీక్షణ
స్ఫురదరుణాంశుపుంజమనిబొంకితికన్గవకెంపుభాగ్యబం
ధురసహజారుణత్వమని నూలొకనాడితివెట్లుదాఁచెదీ
పరిమళవాసనాలహరిపర్వెడుమేన నృసింహభూవరా. ౧౦౩

శఠుఁడు.—

ఉ॥ కనుఁగవఁబాఱఁజూచెదవుగానిమనంబునఁజూడవుక్తులం
దనిపెదుగానిభావమునఁదన్పవొకప్పుడునీప్రియాంత
ల్పనుపడవింకనీసఖులుబచ్చెనచేఁతలుచాలుఁజాలునన్
జెనకకుక్షితిజాకాంతయెన్నసింహప్రియాంగననీకెఱుంగుదున్, ౧౪.

క॥ ప్రకటీకృతులగుసీనా । యకులకువిటపీఠమర్దకాలనఁజేటవిదూ
షకులనఁగలరు ప్రియాకే । ళికలాసంఘటనపటిమ లీలాచార్యుల్, ౧౫.

చ॥ వసుమతి నేకవిద్యగల వాఁడు విటుండనఁ బొల్చు నాయకో
ల్లసనముకన్నఁగొంతగుణలక్షణహీనుఁడుపీఠమర్దకుం
డసదృశచాలికానుఘటనాదిరహస్యవిదుండుచేటకుం
డెసఁగనజస్రహాస్యరసహేతువువాఁడు విదూషకుండిలన్, ౧౬.

క॥ ఈమతమున స్వీయాన్యా । సామాన్యలనంగఁగలరుసతులందుఁబ్రదా
సామగ్రీశీలార్జవ । కోమలకమనీయ స్వీయ గుణములఁజెలఁగున్, ౧౭.

క॥ అన్యయనఁగనన్యోఢయుఁ । గన్యయుసామాన్యయనఁగ గణికామణియా
మాన్యలకుదాహరణములు । ననన్యదృశవిశదఫణితినాపాదింతున్, ౧౮.

స్వీయ.—

ఉ॥ అమృతమువంటిసద్గుణమునంచితచంద్రకలావిలాసభా
వముశివగోత్రభూతియునవారణఁదాల్చియశఃపురంధ్రిదాఁ
గమలవసిహితాన్వయ శిఖామణియైననృసింహమేదినీ
రమణునకేకపత్నియన రంజిలులోకమువెల్ల మెచ్చఁగన్, ౧౯

అన్యోఢ—

సీ॥ పారసీకక్షమాపతులచొప్పడఁగించినేర్పుమీఱఁగమోహనిద్రపుచ్చి
యవనసేనాధినాయకులదోస్తంభసంభరితప్రతాపదీపంబులడఁచి
యభిభూతఖానమల్కావిష్కృతాయశోధ్వాంతసంతతికాత్మ సంతసిల్లి
సమదమహ్మరతురుష్కప్రాప్తసీమల నడుగు మోవఁగనీక యరుగుడించి
ప్రాజ్యసామ్రాజ్యయగువారిరాజ్యలక్ష్మి । కదనసంకేతమునజారకాంతయగుచు
సంచితస్ఫూర్తిఁ నిన్నువరించెనౌర । వైరిగజసింహయోబయనారసింహ, ౨౦.

కన్య—

శా॥ ఆజానేయహునెక్కియోబయనృసింహస్వామివాహ్యాళిరా
జ్యోదంగాంచనసౌధవీధికఁదవీ యోల్లాసముంజూచిమ్మా

తేజోవిభ్రమధన్యకన్యమదనార్తిం జెంది ప్రాసాదపా
ళీజాగ్రన్మణిపుత్రికాసియుతిఁ దాల్చెం దగ్గత స్వాంతయై ౨౧.

సామాన్య—

క॥ ఏరీతి వారు చెందిన। నారీతిఁ దదీయరాగ మండెడి నారా
వారాంగనయది సామాన్యా। త్కారపుఁ బటికెంపు బొమ్మ గాఁ బోలుఁ జుమీ ౨౨.

క॥ ఈ మగువల కాద్యయుమ। ముగ్ధామధ్యాప్రౌఢలనఁగఁ దగు నవ్యవయో
వ్యామిశ్రిత యోగ్యములగు। నామములు తదీయలక్షణము లేర్పఱుతున్, ౨౩.

చ॥ నవనవకామయౌవనసనాథయు నల్పరతంబు గల్గిన
య్యువిదయె ముగ్ధ మధ్య సదృశోదిత యౌవన కామయై రతాం
తవివశయౌ లతాంగి సతతప్రథితోల్బణ కామయౌవనో
త్సవయు రతాదిమోహమును దాల్చు తలోదరి ప్రౌఢ దానగున్ ౨౪.

ముగ్ధ—

శా॥ ఆలాపంబున కుత్తరం బొసఁగ దాయాసంబు సెంగాని తా
నాలోకింపదు పాటలాధరమరందాస్వాదసమ్మదకాముం
దాళం జాలదు కౌఁగిలియ్యదు తనూతాపంబు చల్లారఁగా
నేలజ్జావతి తద్రతంబు దయితాభీష్టంబు గా కుండు నే ౨౫.

మధ్య—

ఉ॥ మానిత వైఖరిన్ మణిత మంత్రములం గబరీవినిగ్గళ
త్సూనములం బ్రసూనశరశూరుని పూజలొనర్చి యారతి
స్థానిని యొప్పెన ప్పడసమానమనోంబుజవీధి నాతనిన్
ధ్యానము సేయు కైవడి రతాంత నితాంత నిమీలితాక్షియై ౨౬.

ప్రౌఢ—

మ॥ నటదుత్తుంగపయోధరం బుజితమందాక్షక్రియోదారమై
స్ఫుటవాగంకుర మక్షికోణనివసత్ప్రేమ దర్పంబు నం
ఘటితాలింగన వామనీకృత కుచాగ్రప్రోథరోమాంచమై
విటుఁ జొక్కించెఁ బ్రఫుల్లపద్మనయనా వీరాయితం బెంతయున్, ౨౭.

క॥ ధీరయు ధీరయు ధీరా। ధీరయు నగు నందు మధ్యధీరాధీరా
ధీరాధీరాహ్వయముల। నారుణి ప్రౌఢయుఁ జెలంగుఁ దల్లక్షణముల్, ౨౮.

సీ॥ తప్పుగలభర్త నొచ్చిలసోల్లుంఠ సఫణితిఁ గేరడములాడు సతిమధ్యధీర సాశ్రు
పరుషవచనయధీర సబాష్పకుటిల। హరివచనధీరాధీర యనఁగఁ జెలఁగు. ౨౯.

సీ॥ శాంతఁదపరాధియైన నాకారగుప్తిఁ । బరఁగి రతి పేశలయిుంచుఁ బ్రౌఢధీర
తాడనోగ్రయధీర యుదగ్రకుటిల । ఫణితియుభయాఖ్య వీరి నేర్పులు తువరుస. ౩౦.

మధ్యధీర—

ఉ॥ సోముని ఘమఘమాశీకరసమూహము గానఁగ నయ్యె నిప్పుడా
రామవిహారకేళిని భరంపడి నాఁడవు నన్నుఁ జూసియూ
శ్రేమదనాస్త్రఘాతముల వేఁగితోనియుర మెల్లఁ దప్పిణా
స్తోమము సోఁకెయున్న యది చొప్పడఁ గాంత యెఱుంగఁ జెప్పుమా. ౩౧.

మధ్యాధీర—

శా॥ చాలుం జాలుఁ బిసాళి సేఁతలు పదా బ్జాతంబు పైమాటికి జా
త్రాలంబోరుభవత్ప్రియా నఖవిమిశ్రంబైన నీ వక్షమీ
నీలస్థాపితకుట్టిమంబౌర సిన స్వేదించు లేలెమ్మని
బాలాసంగమసౌఖ్యవైభవము సూపన్వచ్చి తేయిచ్చటన్. ౩౨.

మధ్యధీరాధీర—

చ॥ పలుకవటంచు నేమిటికి బాముఁ బెట్టెదు కాంత నీపయిం
దెలియఁగఁ దప్పులేమికిని నిన్ననఁ జాలక యూరకుండినం
బలుమఱు సాపరాధుగతిఁ బల్కెద వెన్నఁడు దప్పనీ యెడం
గలుగు నెయంచు నించెఁ దెలిగన్నుల నీరుల తాంగియంతటన్. ౩౩.

ప్రౌఢధీర—

చ॥ హితమతి నాత్మభర్త కెదురేగెదు నేర్పున నేకపీఠసం
గతి హరియించి పల్కుటయుఁ గ్రక్కున నెచ్చెలి కూడిగంబులం
జతురత నేర్పు చందమున జాఱఁగఁ ద్రోచియతిప్రగల్భ యా
సతి యుపచారగౌరవము సల్పెడు నట్టు వహించెఁ గోపమున్. ౩౪.

ప్రౌఢాధీర—

చ॥ పతి నిఁగృతాప రాధుని నవారణవారణయాన యాసునం
గెరలి భుజా కుఞ్జంబుల బిగించి వతంసిత సారసంబునం
గరము దమింపఁగాఁ డొడఁగెఁ గాంతుని సాంత్వన శీతలోక్తులాం
తరవిజకోపతప్త ఘోరక కారణవారిధారగాన్. ౩౫.

ప్రౌఢధీరాధీర—

చ॥ భామముడిపాటు జెందినయఖండిబూని పురంధ్రులు సాపరాధులౌ
రమణులు సేదుకొన్న ననురాగము దాల్పరు రోష్ణిగాను బూ
త్కృత్రిమ మపరాధలేశమును దాల్పనినీవిపు డెంత మ్రొక్కినం
దెమలదు శాంతిఁ బొందదు మదీయమనంబిఁకఁ జాలుఁ బ్రార్థనల్, ౩౭

క॥ ధారుణి మధ్యయుఁ బ్రౌఢయు । ధీరాధీరాదిభేదదీపితలై పే
ర్వేరను జ్యేష్ఠకనిష్ఠయు । నైరంజిలి ద్వాదశాఖ్యలఁగు దురువరుసన్, ౩౮

క॥ కావున స్వీయత్రయోదశ । భావంబు వహించు నన్య పరఁగు ద్వివిధయై
యాబాలాంగన యేకవి । ధావహయై యున్నఁగాఁ బదాఱ్వురు సుధతుల్, ౩౯

గీ॥ మతియు శృంగారశంభుసంభావితాష్ట । తనువులన నీవ్వగాత్ములు విలుతిఁ గాంతు
రష్టవిధభేదములఁ కిరియాంవ్వయములు । లక్షణము లేర్పరించెద లలితఫణితి, ౪౦

సీ॥ బరుఁడు గైవసమైన వనిత స్వాధీనభర్తృక ప్రియాగమవేళ గృహముఁ దనువు
సవరించు నింతి వాసకసజ్జ పతి రాక తడవుండ నుత్కంఠఁ దాల్చునింతి
విరహోత్కంఠ సంకేతమరసి నాథుఁడు [illegible] యా కాంత విప్రలబ్ధ
విభుఁడన్యసతిఁ జెంది వేకువ రాఁగ నుందున బల ఖండితయల్క నధిపుఁ దెగడి
యనుశయముఁ జెందుసతి కలహాంతరిత నిజేశుఁడు విదేశగతుఁడైనఁ గృశతఁ దాల్చు
సతి వప్రోషితపతిక కాంతాభిసరణశీలయభిసారికాఖ్యయై చెలువు మెఱయు, ౪౧

క॥ ఈరీతిఁ జెలఁగు నతిశృం । గారకళాకలిత నాయికామణులకు వే
ర్వేర నుదాహరణంబులు । భూరిమధుర వచనరచనముల నేర్పఱుతున్, ౪౨

స్వాధీనపతిక—

ఉ॥ శ్రీనిధి యోబభూవరు నృసింహుఁడు కైవసమై చెలంగఁగా
భూనుతవైభవస్ఫురణఁ బొల్చు యశోజలజాక్షి నిత్యస
మ్మానితశీలయై ధవుని మన్నన నాదలయొక్కెనట్టి పై
మానికవాహినిన్న గున మందనిజాతిశయంబు పేర్మికిన్, ౪౩

వాసకసజ్జిక—

చ॥ యువనచతుశ్శమాశమముల నాజి జయించి యుదగ్రదిగ్గరో
త్సవవిభవాభిరాముఁడయి సారెక శోబయనారసింహభూ
ధవుఁడరుదెంచు లగ్నమునఁ దత్పురలక్ష్మి విభూషితోల్లస
ద్భవనవిశేషయై మృగమదద్రవవాసనఁ దాల్చు నిచ్చలున్, ౪౪

విరహోత్కంఠిత—

ఉ॥ మెచ్చులవిన్న సింహధరణీశ్వరుఁ దెచ్చెదమంచుఁబోయి రా
రిచ్చుట నీవు నంగరుచి యించుక లేక లరంపగుంపులన్
గ్రుచ్చెదవేల మత్ప్రియునిఁ గూర్చుము మన్మథ నీకుఁ దద్విభుం
దెచ్చుటకై యొసంగెద మదీయకటాక్షమహోజ్జయాస్త్రముల్, ౭౫.

విప్రలబ్ధము—

చ॥ ఎనయఁగ నీనివాసమున కేనరుదెంచెద నంచు నాపయిం
గనుఁగొన నిక్కువంబ ప్రియముగ్గిన వాఁడసుబోలెఁ బల్కి యీ
మనికికి రాక తక్కెసను మాసెపొగాక మదీయదృష్టికిం
బసుపడి మోములున్న గతి మాయలు సేయఁగ నేలభర్తకున్, ౭౬.

ఖండిత—

చ॥ నృపులకు నెల్లవారల భరించుట యోగ్యము గాన నేఁటి కే
యపరిమితోత్సవంబున ప్రియాంగనసదనంబులకేగి నేఁగి యూ
నైవేము సమగ్ర గృహంబున నీవరు దేరఁ బ్రభాతిమన్నెఁగా
కిపుడు నృసింహ నీపయి నొకించుక వంచన లేదెఱుంగుదున్, ౭౭.

కలహాంతరిత—

ఉ॥ ఆనఁగ రానిది యయిన నప్పుడు వాని ధిక్కరించుచో
మానదురాగ్రహము మానుప లేకపు డెందుఁబోయెనో
ధ్యానన వింటిదంట యిపుఁ డేఁపఁ దొడంగె భపవ్యదఘాము
ల్గానని నామనంబునకుఁ గావలెనిట్టి విషాదఖేదనల్, ౭౮.

ప్రోషితభర్తృక—

చ॥ చిరయశోవిభూషుఁడు నరసింహభూవ ప్రభుఖాపకానవాం
తరమున కేగియుండు నిజనాథునిఁ గానక మన్మథాతురై
నరుని సరోజపత్రమున వ్రాయఁగ నెంగిరములెసెమర్చఁగా
వరయనిజాంగకంబెపగయ య్యేవటించుఁ దలంచు దైవమున్, ౭౯.

అభిసారిక—

ఉ॥ నాతిమదిన్ప్రియాభిసరణంబొనరింపఁ దలంచె దీపుచం
ద్రాతపసాంద్రదీధితుల జాండకటాహము నిండఁ బర్వఁగా
శీతిలఁ బెట్లుగూడురపుణీవ లెజేనొకపట్టుఁగాఁగము
క్షాతతులుం బ్రసూనములు దాల్పు మలందుము గంధసారమున్, ౮౦.

సీ॥ అలగంగలో ఘోషమగు నెడ గంగాపదంబు సంబంధియౌ తటము దెలుప
సంబంధలక్షణ జహదర్థ యగు నందు మంచెలు మోసెనటన్న మంచగతులు
దోఁచు గోపండ పట్టులు వచ్చె ననిన యిండ్లను మరు యోధులు దోఁపన జహదర్థ
యవని పాలుఁడు సింహమను వేళ సదృశ తాగుణసిద్ధి సామ్యలక్షణ చెలంగు
నందును సమానము పమేయ మప్రభిన్న । మైన సారోపయుపమాన మగ దితోప
మేయ మైయున్న సాధ్యవసాయ యిట్టి । లక్షణలకన్నిటికి నతుల లక్ష్యములను.

జహల్లక్షణ—

చ॥ అగణిత శౌర్యధైర్య విభవాన్విత యోబయ నారసింహ నీ
గగనచరీమరాగ శిబికర్ణ జయోన్నత దానలక్ష్మికిన్
జగములు సంతసిల్లె నతిసాంద్రభవ ద్యశ భేరి బాంకృతి
ద్విగుణిత సైన్యఘోషముల వేసఁడెఁ శత్రుపుట్టిణాపళుల్. ౬౨.

అజహల్లక్షణ—

క॥ ఆసమరణరంగమున నీ । యసిపట్టిన టియిఁ పఁగ రులహా కులన్నిరులన్
వెసఁ నొసఁగునారయొంతటి । రసికుఁడు నీవైరి యోబరాజనృసింహా. ౬౩.

సారోపలక్షణ—

మ॥ అమరద్వీపవతీ ఝుఠాంతరములం బాహూధిసీలాంబుపూ
రము సూర్యాశ్మజఁ గాఁదలం ప్రదుర సార ప్రౌఢి సైఁగొండఱు
ద్యమ తేజోధిక నారసింహభవదుద్యత్కీర్తి జానిఘూర్ణిత సం
భ్రమయౌ గంగ యకీర్తి దాల్చె నని సేభావింతుఁ జిత్తంబునన్. ౬౪.

సాధ్యవసాయలక్షణ—

క॥ నిరతబుధ ప్రహ్లాదా । దరకరుఁడు హిరణ్యకశిపుదానోన్నతుఁడై
ధరఁబోచిరాజివంశ । స్థిరరత్న స్తంభమున నృసింహుఁడు పుట్టెన్. ౬౫.

క॥ సంగతములగు పదార్థము । లంగల వాక్యార్థమున కలంకారంబై
రంగగు నర్థాంతరమర । యం గావ్యము లందు వ్యంజనాఖ్య చెలంగున్. ౬౬.

క॥ ప్రకృతోపపన్నకభేధకుఁ । బ్రకృతానుపపత్తి గోచరకు లక్షణకున్
బ్రకటిత విభేదవ్యంజన । ప్రకృతా ప్రకృతోపపత్తిఁ బరఁగెడు కతనన్. ౬౭.

గీ॥ జగినదియు శబ్దశక్తిమూలంబును । నర్థశక్తిమూలమయ్యనుభయ
శక్తిమూలమునఁగ నొప్పు తిరగాఁ చుఁడ । వి మూలత్ర్యమునను డెపెఖుతు. ౬౮.

శబ్దశక్తిమూలవ్యంజన—

క॥ ఘనతనృసింహుని కరమునఁ । దనరెడు నసినిజసమగ్రధారాగ్రనిమ
జ్జనతత్పరులగు నరులకు । ననిమిషభావంబు గల్గు ననవరతంబున్. ౧౯

అర్థశక్తిమూలవ్యంజన—

చ॥ అలఘుపరాక్రమక్రమ సమగ్రభుజాగ్ర నృసింహభూపనీ
విలసదనూనదానగుణవిభ్రమ మెంతయు నాలకించి తా
వెలవెలఁబాఱె మేఘము మరందవిరోధియుఁ గందువాఱె నా
కలపడెఁ గల్పశాఖి తృణకోటి గ్రసించె నమర్త్యధేనువున్. ౨౦

ఉభయశక్తిమూలవ్యంజన—

క॥ అరిదరకరుఁడై సుమనో । వరభరణధురీణుఁడై యవారితలక్ష్మీ
స్థిరవాసభాసురుండై । నరసింహుఁడు వొల్చుఁ ద్రిభువనస్తుతమహిమన్. ౨౧

గీ॥ మఱియు రచనాశ్రయంబులై మధురరసని । వేశయోగ్యత వృత్తులు కైశికియును
నారభటియును సాత్త్వతిభారతియును । నాఁగఁ బొగడొందుఁ దల్లక్షణముల్ గనుఁడా

మ॥ చెలఁగుం గైశికి కోమలార్థరచనాశ్రీ నుద్ధతార్థక్రమా
చలితాడంబరమూర్తియారభటియొప్పుం బత్త్రిసందర్భని
శ్చలయా భారతి పొల్చు సాత్త్వతి యసీమత్కోమలార్థక్రమం
బులనీవృత్తులకున్ యథోచితరసస్ఫూర్తుల్ నిరూపించెదన్. ౨౨

గీ॥ కైశికి చెలంగు శృంగారకరుణలందు । నారభటి రౌద్రభీభత్సహారిణియగు
నలరు భారతి హాస్యశాంతాద్భుతముల । నమరు సాత్త్వతి వీరభయానకముల. ౨౩

కైశికి—

ఉ॥ తిన్ననిమేను గన్నుఁగవ తేటలు తేనియలొల్కు మాటలున్
సన్నపుఁగౌను గుందనపుఁ జాయలు దేఱు మెఱుంగుఁ జెక్కులుం
గ్రొన్నెలవంటి నెన్నుదురు గుబ్బచనుంగవ తళ్కుఁజూపులున్
జెన్నలరారఁ గన్యనరసింహునిఁ జూచె విలాసధన్యయై. ౨౪

అరభటి—

మహాస్రగ్ధర॥— ప్రతిపక్షక్ష్మాపవక్షః ఫలకవిదళనప్రౌఢగాఢప్రతాప
ప్రతిభాసంరంభగుంభప్రబలసుబలశుంభన్నృసింహాగ్రరంహా
యుత మైకల్పాంతదృప్యద్ద్యుమణిధగధగప్రోద్యతజ్వాలజాల
ప్రతికూలప్రక్రమంబై పరఁగు నరసభూపాలదోఃఖడ్గమాజిన్. ౨౫

భారతి—

కలమహానటజటావలభీనుండఁగఁగల్గి నెలకొన్నచల్లనివెలుఁగువాని
కవురభువనాతిశాయివైభవవిభూతిఁ। బూనిజగదేక జేగీయ మానుఁడైన
యోబభూపాలునరసింహుఁడుర్వియందు। నవతరించిశుభస్ఫూర్తి ననితిశయిల్ల ౯౨.

గీ॥ ఇందుఁదలయెత్తుకొనఁగల్గెఁ దందశూక। పతికినరసింహ భూపాలుఁడుర్వి
తాల్చెనను వ్యంగ్యమాదియౌ ధ్వనులు దోఁపఁ। దనరునుత్తమకావ్యమై ధ్వనియనంగ.

గుణీకృతవ్యంగము—

క॥ కొలువానయొసఁగిసురగవి। పిలికిలఁబడఁగల్పతరువు వేఁడినమఱియా
కులపడి పంక్తిగిలించును। నలువుగనినుఁబోలఁగలరె నరసింహనృపా. ౯౪.

క॥ నినుబోలఁగలరెసురతరు। వను నెడ లేదనెడి వ్యంగ్యమరయఁగవాచ్యం
బునతిక్రమించిమించమిఁ। దనరున్దరనిది గుణీకృతవ్యంగ్యంబై. ౯౫.

క॥ చిత్రముశబ్దార్థోభయ। చిత్రములనఁద్రివిధగతులఁ జెలఁగునదియుసం
సూత్రితమగుమాందమనా। చిత్రాలంకారతతులు చెప్పెడిచోటన్. ౯౬.

క॥ ద్వివిధంబగుధ్వనికృతులం। దవిరళగతిలక్షణాభిధామోజితమై
యవివక్షితవాచ్యంబును। వివక్షితాన్యపరవాచ్యవృత్తియుననఁగన్. ౯౭.

క॥ చనునత్యంతతిరస్కృత। మనసర్థాంతరసమేతమన ద్విధఁగై
కొనియవివక్షితవాచ్యం। బినుమడియగువాక్యపదము లెనసిననదియున్. ౯౮.

చ॥ సనుపుగ వీనిలక్షణ మొనతుఁడ్ధృతిందిరుఁడన్నధృష్టుఁడ
ధ్వనియభిభూతవాచ్యముగఁదత్ప్రిథమంబు చెలంగుచుయావను
ల్మనమునఁగ్రొవ్వుమానుఁడనఁ దద్యవనాళినిద్రుంచునీతఁడ
ధ్వనియితరార్థసంక్రమిత వాచ్యముగాఁగ ద్వితీయమింపగున్. ౯౯.

గీ॥ అథయుమఱియువివక్షితాన్యపరవాచ్య। మవనిలక్ష్యక్రమవ్యంగ్యమనసలక్షి
తక్రమవ్యంగ్యమన ద్వివిధంబువీని। లక్షణము లేర్పరించెదలలితఫణితి. ౧౦౦.

గీ॥ ఇతడునరసింహుఁడను నెడనిదియవ్యంజ। కంబగుచు ధృష్టుఁడనెడు వ్యంగ్యమునువరుస
దెలుపలక్ష్యక్రమవ్యంగ్యమిలనలక్షి। తక్రమవ్యంగ్యమిట్లు వేద్యక్రమంబు. ౧౦౧.

గీ। అందులక్ష్యక్రమవ్యంగ్యమమరుశబ్ద। శక్తిమూలంబనఁగనర్థశక్తిమూల
మనసుభయశక్తి మూలంబు ననఁద్రిసంఖ్య। దాల్చువెర్వేఱ వీనిభేదములొనర్తు.

క॥ తనరారువస్తురూపం। బనఁగనలంకారరూపమనంగి ద్వివిధమై
ఘనవాక్యపదగతత్వం। బునసాల్గగుశబ్దశక్తిమూలనుధరణిన్. ౧౦౩.

సీ॥ సమధికంబగునర్థశక్తిమూలము స్వతః ప్రతిపన్నమనఁగఁ బ్రౌఢవచన
సిద్ధంబు సుకవినిబద్ధోక్తిసిద్ధంబునన నద్రిరూపంబగు నవియు వస్తు
కలితవస్తుధ్వనియలవస్తుభవదలంకృతిమయధ్వనియలంకృతినిరూఢ
వస్తుధ్వనియలంకృతిస్తుతాలంకృతిధ్వనియును నాల్గుభేదములు వరుస
నాఁగఁ బన్నిదాల్పరతిసంఖ్య నొనరునవియు దనరుమప్పదియాఱై పదప్రబంధ
వాక్యగతభేదములనిట్లు వఱలునుభయశక్తిమూలంబు నేకమై జగతియందుఁగాంచు

క॥ నలువదియొకరూపంబులఁ । బొలుపగునీరీతిభేదములకాస్పదమై
యలసంలక్ష్యక్రమమన । వలరెడువ్యంగ్యంబశేషమాపాదింతున్, ౧౦౫.

క॥ అసమవిభావాదులచే । రసధ్వనిజనించువేళఁ గ్రమమెదవమిఁ బెం
పొసఁగునలక్ష్యక్రమమై । యెసఁగినవ్యంగ్యంబు దీని కిలభేదంబుల్, ౧౦౬.

క॥ పదవాక్యవర్ణరచనా । పదైకదేశములఁ గృతులఁ బరఁగుచు నారా
యిదిగూడ నలువదేడగుఁ । బదిలముగ వివక్షితాన్యపరవాచ్యమిలన్, ౧౦౭.

క॥ మునుపవివక్షితవాచ్యం । బునఁగలిగిన నాల్గుభేదములునివిగూడం
దనరుఁ గృతిజీవశుద్ధ । ధ్వనియేకశతార్థభేదవంతంబగుచున్, ౧౦౮.

క॥ ప్రకృతంబులైనయీధ్వను । లొకటొకటింగూడ నేఁబదొకభేదములం
బ్రకటితమగుఁ బ్రాగ్భేదం । బకటద్వితీయంబు నేఁబదగునీరీతిన్, ౧౦౯.

క॥ కృతినన్నియు నేకైకో । నతసముచితసంఖ్యగాఁ గొనఁగ మిశ్రంబుల్
క్షితివడ్వింశత్యుత్తర । శతత్రయాన్విత సహస్రసంఖ్యఁ జెలంగున్, ౧౧౦.

గీ॥ త్రివిధమగుసంకరమునసంసృష్టిచేత । నొకటొకటినాలుగైయివి యొప్పమీఱు
నవనిఁజతురుత్తరశతత్రయాభిరామ । పంచశశతభేదప్రపంచగరిమ, ౧౧౧.

క॥ ఎన్నికవీనినిలక్ష్యము । లన్నిటికినొనర్పజాలి యగునను భీతిన్
గొన్నిటికొనర్పవినుఁడు ప్ర । సన్నలసన్నవవచోవిచారధురీణుల్, ౧౧౨.

అత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వని—

క॥ ఖరఖురకుట్టనఘట్టిత । ధరణిరజస్స్థగితసదృశతామదవిచల
త్కరకరతురగోత్కరమై । కరమమరున్నృసింహధాటికాహాయమవనిన్, ౧౧౩.

క॥ ఖరఖురకుట్టనఘట్టిత । ధరణిరజస్స్థగితసదృశతామదవిచల
త్కరకరతురగంబను నెడఁ । దిరస్కృతస్వార్థమగునదిబహుబ్రీహిన్, ౧౧౪.

అర్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వని—

ఇంద్రసుతుంజయించినరసేంద్రుఁడొకమ్మునయంత్రమత్స్యముల్
సాంద్రనిరూఢి నేసెనని సంతతమున్వినితత్తఱించిమ
త్స్యేంద్రుఁడు యోగముద్ర ధరియించిచరింపఁ బోఁడంగేనారని
స్తంద్రజవంబునన్వెపిన శైలగుహాగహనాంతరంబులన్, ౧౧౬.

గీ॥ సరసభూభర్త యంత్రమత్స్యంబునేయ। నలుకమత్స్యేంద్రుఁడనుసిద్ధనాత్మమత్స్య
శబ్దసామ్యంబుచేఁగల్గుశంకఁదనరు। వ్యంగ్యమర్థాంతరసమేతవాచ్యమగుచు, ౧౧౭.

శబ్దశక్తిమూలాలంకారధ్వని—

క॥ ఈకోమలిపత్నినియఁట। యేకాలముఁబ్రోచునినుఁడవీవఁట సతిదా
నీకరసంస్పర్శనమానఁ। గాక చెలంగునె నృసింహఘనబలసింహా, ౧౧౮.

గీ॥ ఇందుఁబ్రకృతంబులగువధూ నృపతివాచ। కంబులలపత్ని నీన శబ్దంబులెలమిఁ
గమలినీభాస్కరుఁదెల్పఁగలుగునుపమ। వ్యంగ్యముగనీయలంకృతిధ్వని చెలంగు.

శబ్దశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని—

క॥ ఆపన్నులార చెప్పెద। మీపాలిటికిని హితంబు మెఱయున్నృసింహ
శ్రీపాదకమలసేవా। వ్యాపారము మఱవకుండుఁడాత్మలలోనన్, ౧౧౯.

గీ॥ ఇచ్చటన్నృసింహపదసేవ నెనయుఁడనెడు। శబ్దశక్తిప్రకృతుఁడౌ జనవరేంద్రుఁ
గొలువుఁడతఁడాపదలుమాన్పఁగొలుచువారి। కనెడువస్తువు వ్యంగ్యమైయతిశయిల్లు.

స్వతస్సిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని—

ఉ॥ చల్లనివాఁడుమా నెలవు చందురుమామకడంగివేఁడుమా
ల్చల్లనివాఁడుమాయచటిచందనశైలసమీరుఁడంచుఁద
ద్భిల్లవధూమతల్లికలఁబేర్కొని పల్కనృసింహ మేదినీ
వల్లభ నీవిరోధినృపవల్లభు లుగ్రభ శైలవాసరై, ౧౨౧

ఉ॥ చల్లనివాఁడుమా నెలవుచందురుమామయటన్నఁదద్విప
ద్వల్లభభాగ్యవైభవము వ్యంగ్యము తద్ధ్వనిచేత నాయకా
యుల్లకమగ్నయానను టవ్యంగ్యముతద్ధ్వనిచేతవ్యంగ్యమౌ
నెల్లవిరోధిరాజుల జయించెవిభుండనువస్తువెంతయున్, ౧౨౨.

వస్తుకృతాలంకారధ్వని—

మ॥ ఫలిలచ్ఛాయఁగుఱించియంత్రకృతమత్స్యంబీనృసింహక్షమా
తలనాథాగ్రణియేసెనంచుఖినిత ధ్వంసాధిపుంబట్టినన్

సలిలచ్ఛాయంగుఱించి యేయుననియంచద్భీతి మార్తాండునిన్
బలిమిం బట్టఁడు వేగరాహు విధునింబైకొన్న చందంబునన్. ౧౨౫

గీ॥ యంత్రమీనంబుదునుమాడినట్లు దునుము। ననియు కాఁబోలు రాహువఱ్ఱునిగ్రహింప
డనెడు నుత్ప్రేక్షవాచకంబెనయ లేమి। వ్యంగ్యమగునిట్టి వాక్యార్థవైభవమున. ౧౨౬

అలంకారకృతవస్తుధ్వని—

ఉ॥ భూరిభుజాప్రతాపగుణ భూషణ యోబయ నారసింహ నీ
చారుయశోవధూమణికి సారసవైరి ముఖంబు తారకల్
స్ఫారనఖాంకురంబులలశంకరశైలహిమాద్రిలాత్మవ
క్షోరుహముల్ సితాబ్జములు సొంపగులోచనపంకజాతముల్. ౧౨౭

గీ॥ తనరు సత్కీర్తి కాంతకుఁదారకాదు। లరయనంగంబులై వేడ్కఁబరిణమింపఁ
గలుగు పరిణామమునఁ ద్రిలోకములు నిండు। నరసవిభుకీర్తి వ్యంగ్యమనంజెలంగు.

అలంకారకృతాలంకారధ్వని—

చ॥ అరిపురభంజనోజ్జ్వలబలాధిక శ్రీనరసింహరాజశే
ఖర భవదీయకీర్తి రుచిగంగయనంగఁ జెలంగుఁ బొంగుచున్
హరిపదసంగ సంకలిత యై భువనత్రయ పూర్ణ యైనిరం
తరతరహంసజాంశు సముదాయ సమన్విత యై వసుంధరన్. ౧౨౮

గీ॥ రాజశేఖరభవదీయ రమ్యకీర్తి। యొనరునలగంగవలెననునుపమచేతఁ
బరఁగు మన్నృసింహసీవు శంకరునికరణి। ననునుపమ వ్యంగ్యమా నిందు నరసి చూడ.

కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తు కృతవస్తుధ్వని.

సీ॥ ఒంటిగా మడికాసుకుంటి పైఁగూర్చుండి సంజకెంజాయ పెన్జడలు దాల్చి
సొరిది నేకాలంబు సురనదీస్నాతుఁడై నిద్దంపుబూది మైనిండనలఁది
యచ్చుగాఁబులితోలు కచ్చడంబు ఘటించి యొడలఁబాములు ద్రాఁకనోర్పుగలిగి
హాలాహలానలాక్షీలధూమముగ్రోలి యజచేత హవ్యవాహనముఁబూని
సీయశోలక్ష్మిఁబోలు పూనికలఁదపము। సేఁడునానరించుచున్నాఁడు నీలగళుఁడు
కాని యొడనేలయతనకీ గతిఁ జెలంగి। సరసగుణహార యోబయ నరసధీర. ౧౨౯

క॥ నరసవిభుకీర్తిఁబోలఁగ। హరుఁడుదపము సేయుచుండు ననువస్తువుచే
స్ఫారగాదాతసకీర్తికి। హరుఁడునుననుపస్తువలరు వ్యంగ్యంబగుచున్. ౧౩౦

కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని.

క॥ మేలిమి నృసింహధరణీ । పాలు ప్రతాపాగ్ని దిశలఁ బ్రబలినఁ గీలా
భీలదవానలము డవుల । పాలయ్యె జలధిఁ బడియె బడబానలమున్, ౧౩౧.

క॥ జనపతిప్రతాపమునకుఁ గ । వనవాటికి నరిగె దావవహ్ని యనెడి చో
మనమునఁ గలఁగియు నుండె । ననియెడు నుత్ప్రేక్ష వ్యంగ్యమగు వస్తువుచేన్, ౧౩౨.

ఉ॥ అంచితవిక్రమంబున మహాసమరవ్రతదీక్ష చేను బో
షించిన కారణంబున నొ శ్రీనరసింహుకృపాణమాజులం
బొంచి మదించి మించు నరిభూభృదకుంఠితకంఠపీఠముల్
త్రుంచియు వాతనంటుదల దుఃక్షితిపక్షతజప్రవాహముల్, ౧౩౩.

క॥ అలఘుగతిని బోషించియు । బలెనంటు దురక్తమతని పటుఖడ్గమనం
గలిగినయుత్ప్రేక్ష వలన । నలఖండన వేగవస్తువలరున్ ధ్వనియై. ౧౩౪.

కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని—

శా॥ ఆమోదంబున శ్రీనృసింహవిభుదానాంభోనదుల్ సాగర
స్వామిం జెందయశంబు మేఘములఁ బర్వం గల్గు వర్షాశర
త్సామానాధికరణ్యశంకన చకోరస్తోమోదరుండ్గొందుని
ద్రాముద్రానుగతప్రబోధములఁ జిత్రంబే కకాలంబునన్, ౧౩౫.

గీ॥ హరికిశివపాదశరద్భ్రాంతియడరునెడి । భ్రాంతిమదలంక్రియారూఢిఁ బ్రబలు నిద్ర
దెలివినున్నట్లు యోగనిద్రలు వహించు । ననెడియుత్ప్రేక్షవ్యంగ్యమై యతిశయిల్లు.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని—

మ॥ అనురాగాంబుధియుబ్బి వెల్వడిన యట్లాపూర్ణఘర్మాంబువుల్
దనువల్లిం దిగజారఁ గన్నుఁ గవ తేఁ దళ్కుల్పి సారించుచున్
వనవిల్కానిపురప్రవేశకలనానాళీకదామంబులై
తనరం గోమలి నిన్నుఁ జూచె నరసేంద్రా సాంద్రతేజోనిధీ, ౧౩౬.

క॥ ఈవాక్యార్థము చేతను । భూవల్లభ నిన్నుఁ గోరె బాలఁ తివిరహతా
పావృత్తి నున్నదిపుడను । నావస్తువు వ్యంగ్యమగుచు నతిశయ మొందున్, ౧౩౭

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని.

చ॥ సురగిరి చుట్టు నుంబ వరిచుట్టెద వేలది నేశరత్నసం
భరితము దేవతాధనముఁ బాయక కాచెదనంచు నేఁటికిఁ

సురతరులం గరాంగుళులఁ జొప్పడఁ దాల్చియ శోభఁ గంగఁ జేఁ
బరఁగి నృసింహుఁడే సుకవి పఙ్క్తులఁ బ్రోవని చేలయేరికిన్, ౧౩౯

కం॥ తన రేడు నీవ కార్యా ర్థం | బున శ్రీనరసింహుఁ డఖిలమును బ్రోవఁగ నా
యనిమిష గిరివలెం దగునను | ననుపమమగు సుఘనవ్యంగ్యమై పొగడొందున్.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తుధ్వని —

చ॥ ధరణి ననంతకీర్తియుఁ బ్రతాపముఁ గల్గిన రాజవాటనిన్
ధరణిమనోరవిందమునఁ దాల్చిన చుట్టితికంబు పేర్మినో
కరివరయాన కన్విశదకాంతియుఁ గాఁక యునైకడంగి వి
త్తరమగు మేనఁ గీర్తియుఁ బ్రతాపము విల్చె నృసింహభూవరా, ౧౪౧.

సీ॥ నెఱయు కీర్తిప్రతాపాఢ్యు నిన్నుఁ దలఁప | యశము శౌర్యంబు గలిగినట్టులరు వెలఁదు
గాఁక యును ననును త్ప్రీతుఁ గాంత నేలు | విరహమున కోర్వ దను వ్యంగ్యవిభవ మలరు.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని—

చ॥ చెలువయ దేమి యొప్పగువ చిత్రమునందు నృసింహభూవరుం
గలయ లిఖించు కేళఁ బులకంబులు గ్రొంజెమరుం దలిర్పఁగా
నాలయ వడంకుచున్నది సముజ్జ్వలమైన నృపాలరూపముల్
వలపులు రేఁచుచున్న రతివల్లభురూపన్నిభీతిఁ జెందెనో, ౧౪౩

కం॥ వరు నిలిఖించుచు వడఁకెడి | సరోజశరుఁ డని యొయ్యనెడి సందేహమున
న్నరసింహుఁడు మరుకై వడిఁ | బరఁగున నెడియుపమ వ్యంగ్యం భావమునొందున్.

కం॥ ఈ వరుస ప్రబంధాదిక | తా వేల ధ్వనులు బుద్ధి ననుమేయములౌ
నా తలర సధ్వనులు రస | భావప్రకరణములం బ్రపంచితములగుచున్, ౧౪౫.

గీ॥ ఇచట మధ్యమ కావ్యమై రుచిరమగును | గుణీకృతవ్యంగ్యవిభవంబు నిశ్చయింతు
నిదియు నెనిమిది భేదంబు లెనయు వాని | భవ్యనామంబు లెఱిఁగింతుఁ బ్రక్రమమున.

కం॥ అమరు న గూఢము నపరాం | గము వాచ్యాంగంబు నప్రకాశము సంది
గ్ధము నల తుల్యప్రాధా | న్యము గా కాక్వాక్షిప్త మరుచిరాఖ్యము ననఁగన్, ౧౪౭

కం॥ వనితా కుచకుంభము గతి | ధ్వని గూఢంబైనఁ గాని హైదగ్ధ్యము లే
మినిఁ దగు మధ్యమకావ్యం | బని మిది వగలకు నానర్తు నిలలక్ష్యంబుల్, ౧౪౮.

అగూఢము—

కం॥ పరిపతితకవాటములై | పరిపాటితకనకకూటపటువాటములై
యరినికరపురప్రకరము | లరుదుగ నరసింహు శౌర్యమంతయుఁ దెలుపున్, ౧౪౯

క॥ పరిపంథికవాటములై । యరిపురములు దెలుపు శౌర్యమంతయు నను చో
నరివరులఁ గెలిచె విభుఁడని । పరఁగెడి వ్యంగ్యంబు గూఢభావము జెందున్. ౧౫౦.

అపరాంగము—

క॥ మెడఁ గ్రుచ్చి కౌఁగిలించును । నొడలెల్లం బారవశ్య మొందించు నరిన్
వడి మోహ నిద్రపుచ్చును । బుడమి నృసింహేంద్రు ఖడ్గపుత్రిక యారా. ౧౫౧

క॥ రంగుగ నీయెడ ధ్వనియగు । శృంగారము రౌద్రరస విశేషమునకుఁ దా
నంగంబై విలసిల్లుచు । సంగతి నపరాంగమనఁగ సన్నుతి కెక్కున్. ౧౫౨

వాచ్యసిద్ధ్యంగము—

క॥ ధారుణి శ్రీనరసింహుని । నీరంధ్ర ధనుర్వినీల నీరదము మరున్
దారుణతర శరధారా । వారిత రిపుశౌర్యసూర్య వైభవ మగుచున్. ౧౫౩.

క॥ శరధారయనఁగ ధ్వనియై । పరిణతమగు సలిలధార పార్థివుని ధను
ర్వరదము ను వాచ్యమునకు । ద్వారలో నంగంబు గాఁగ వాచ్యాంగ మగున్. ౧౫౪

అస్ఫుటము—

క॥ శ్రీనరసింహుని భుజస । న్మానిత ఖాక్షేయకంబు మహీమండలిలో
నానారిపు భూనాథవి । తానార్జిత కీర్తిదుగ్ధధారల గ్రోలున్. ౧౫౫.

క॥ అరికీర్తి దుగ్ధమానును । ధరణీశ్వరు ఖడ్గమను దువర్వీకరశే
ఖరము గతిఁ బొల్చునని యెడ । నరసోపమకృతులయందుఁ జనునస్ఫుటమై. ౧౫౬.

సందిగ్ధము—

క॥ నరసింహుని భంగుర సం । గరమున నెదిరించు రిపులు గడు ముందఱ గా
నరుగుదురాయిత పడుమురు । శరములు విడుతురు సమగ్ర సంభ్రమపరులై. ౧౫౭.

క॥ అరివరులాయిత పడుమురు । శర జాలము విడుతురనిన సమరంబున కా
గ్గిరిగుహలకరిగి నాలను । సరి వ్యంగ్యములలరుచుండు సందిగ్ధము తై. ౧౫౮.

తుల్యప్రాధాన్యము—

క॥ నరసింహేంద్రుని చరణం । బరుణంబుగ సంఘటించ్ప్రఁ బెరులారభవ
వ్యరమతుటుస్ఫురణంబుల । నదు లంబగు నతని నయవచటు గాకున్నన్. ౧౫౯.

క॥ నరసింహేంద్రుని కుసుమ । స్ఫురణంబౌనరింపకున్నఁ గాంతారంజే
శరణంబగునను వ్యంగ్యము । నిరవగు వాచ్యంబు సమములిప్పుడు దలఁపన్. ౧౬౦

కాక్వాక్షిప్తము—

॥ ఒసఁగుననెడఁగ నరుగర్జిలు । నొసఁగియొసఁగి వెల్లఁబాలు రోసీకరణిన్
విసువక యొసఁగఁగఁగ వేర్చునె । యసదృశగతి నెంబు వాహ మాబళ నరసా. ౧౬౧.

క॥ ఒసఁగు నెడఁగ సరుగర్జిలు । నెసఁగఁగ నీలాంబువాహమిల నీవ లేఁదా
నొసఁగఁగ నేర్చునె యనవుడు । నొసఁగఁగ లేదనెడి వ్యంగ్యమొగిఁ గాకువగున్.

అరుచిరము—

మ॥ బలితంబై నమనోజబాణహతిచేఁ బల్మారు నిల్పోపలే
కలినీలాలక ప్రాణముల్ విడలి నేత్రాంభోజమూగంబునం
గలయం బ్రాఁకుచు వచ్చియున్న లవునంగన్నీటియే అడ్డమై
నిలుపన్నిల్చెను సింహభూరమణ మన్నింపంగఁ బాడింతటన్. ౧౬౩

క॥ ఏణాక్షి రాకయున్నను । బ్రాణంబులు విడుచుననెడి వ్యంగ్యంబునకున్
క్షోణి నవాచ్యము కన్నఁగ్రా । వీణత్వము లేమిఁ దనరు వెసనరుచిరమై. ౧౬౪

గీ॥ ఇంకఁ గావ్యప్రభేదంబు లేర్పరింతు । వరుసనష్టాదశవిశిష్టవర్ణనములు
గలుగవలయు మహాకావ్యతిలకమునకు । నెలమిఁ దన్నామధేయంబులెట్టి వనిన.

క॥ పురసింధునగర్తువనశశి । సరసీవనమధురతిప్రసంగవిహారముల్
పరిణయతనయోదయనయ । విరచనయాత్రాజిదౌత్యవిభువర్ణనముల్. ౧౬౬

గీ॥ ఇందునొకకొన్ని కడమైన నెంచిచూడ । నదియు నవని మహాకావ్యమనఁగఁబరఁగు
మఱియు క్షుద్రప్రబంధనిర్మాణమర్మ । లక్షణము లేర్పరించెద లలితఫణితిఁ. ౧౬౭

క్షుద్రప్రబంధము—

క॥ కలికోత్కలికలు పద్యము । లలరారు విభక్తులందు దాభాసయుతో
త్కలికలు సజయతి పదమూ । నలమాలిని మొదలఁ దగు నుదాహరణమగున్. ౧౬౮

క॥ అంమవిభక్త్యాభాసము । లందుఁ జతుర్థికిని వెనుఁగుదాహరణము పెం
పొందంగ లికోత్కలికల । గుందీప్తవిభక్తితాలసంప్రాసంబై. ౧౬౯

క॥ ముక్తపదగ్రస్తంబై । సక్తాదిమపద్యమై ససంబోధనమై
ప్రోక్తమగుఁ జక్రవాళలక్షణ । సూచితమై బిరుదభరతశుభవాఙ్మయమై
యాచక్రవాళవిపుల । త్వాసచక్రమ నందు బిరుదగద్యము పొల్చున్. ౧౭౧

క॥ తరుణీమణిశృంగారము । విరహము మధుమదనగర్వవిభవంబు సరో
వరవనఖేలనములుగల । దరయన్మంజరియనంగ నభినుతి కెక్కున్. ౧౭౨

క॥ తారకలిరువదియేడును । నారయ నొక్కొక్కపద్యమందుఁ జెలంగం
గూరిచిన పద్యమాలిక । తారావళియనఁగ నభినుతంబై పొల్చున్. ౧౭౩

మ॥ ఫణిశుంభద్భుజసారసారసనుఖీపం చాయుధాకారకా
రణసంతత్యవతార తారగిరిధైర్యస్థేమదుర్వారవా

రణసమ్రాడ్బలభారభారవికవిప్రౌఢోక్తి సంచారచా
రణసంస్తుత్యవిహారహారహారవిభ్రాజద్యశోవైభవా, ౧౭౪

దివ్యము—

క॥ భూమిసుమనోమరద్రుమ । వామాప్రద్యుమ్నభానువంశోద్భవహా
లోమివిభుశుభవైభవ । భీమోపమభీమభీమపృథుదోర్విభవా, ౧౭౫

పంచచామరము—

ఘనాఘనాఘనాశనాధికప్రదానరంజనా । జనావనాదినాగతల్పసత్కృపాప్రసాధనా
ధనాధినాథనందనాబ్జదర్పకాంగవాసనా ।సనాతనాధునాతనాతిశౌర్యధుర్యలంఘనా.

గద్యము.

ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంకుశ
ప్రతిభాబంధుర ప్రబంధ పరనరచనాధురంధర ప్రబంధాంక
వేంకటరాయభూషణసుపుత్త్రి తిమ్మరాజపౌత్త్రిసకలభాషా
విశేష నిరుపమావధాన శారదామూర్తిమూర్తి ప్రణీ
తంబైన కావ్యాలంకార సంగ్రహంబను మహాప్ర
బంధంబునందు సర్వరససాధారణ నాయకల
క్షణంబును శృంగార నాయికాఖ్యానంబును
రీతివృత్తి ప్రశంసయుఁ బాకశయ్యా
ప్రపంచనంబును గావ్యభేద ప్రక
రణంబును మహాకావ్య ప్రకట
నంబును క్షుద్ర ప్రబంధ
మార్గ దర్శనంబు
నన్నది.

ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# నరసభూపాలీయము.

## కావ్యాలంకార సంగ్రహము తృతీయాశ్వాసము.

శ్రీరమణీచరణసేవా । పారాయణయుభయవంశపావనలక్ష్మీం
జారచితభాగధేయయ । పారకృపాసారసమ్మోబహాభీశా నరసా. ౧

ఆ॥ అవధరింపు ముల్లక్ష్యలక్ష్యములనెల్ల । ననఘభావధియనామధేయాంకితముగ
బహువిభక్తులనొనరింతుఁ బద్యపఙ్క్తి । నిచ్చటఁ బ్రబంధజీవితం బెట్లటన్న. ౨

గీ॥ మహితకవితావిలాసినీమధురతరవి । లాసవిన్యాసములఁ బొలవాని కెక్క
నవరసంబుల నాటఁగింతు నర్థ । గుంభగంభీరతరవచోజృంభణముల ౩

క॥ ప్రకందంబులు లిపిన । నలువగు సక్తిల మురసాయి నంబగుపగిదిన్
లలితవిభావాదులచే । నలఘుతరస్థాయిభావ మమరు రసమ్మై. ౪

గీ॥ గరిమ నదులెన్ని గలిసినఁ గప్పుకొనుచు । జలధిగను పట్టు రీతి సంచారిభావ
సంచయము లెన్ని గలిసిన సమితి వసిక । తానకను పట్టు భావంబు స్థాయి దలఁప. ౫

క॥ ధరశృంగారము హాస్యము । కరుణయు వీరము భయానకము బీభత్సం
బురురౌద్రమద్భుతము శాం । తరసంబును రసములనఁగఁ దనరుం గృతులన్. ౬

క॥ రతిహాసశోకయత్నము । లతిభీతిజుగుప్స క్రోధ మచ్చెరువు శమం
బతులక్రమమున నివి స్థాం । ప్రతమురసస్థాయిభావభావనఁ జెందున్. ౭

క॥ రసములకుఁ గొన్ని దింటికిఁ । బొసఁగిచయి స్థాయిభావ ములకు నొనర్తున్
రసికత లక్షణలక్ష్యము । లసదృశరసశాస్త్రవేత్తలౌనా యనఁగన్. ౮

రతి—

క॥ తరుణీ మణులకుఁ బురుషుల । కరయఁగ సంభోగవిషయమగు నభిలాష
స్ఫురణము మనములఁ బొడమిన । ధరలోన దది రతియనంగఁ దగు నట్లన్నన్. ౯

ఉ॥ చల్లఁదనంబె చంద్రునకుఁ జక్కఁదనంబె ప్రసూనధన్వికి
న్నల్లితొరు సౌరభమె చైత్రునకొక్కని కొక్కవేలి మే
తెల్లము గాక నాపతియు దీనగు శౌర్యముదు నారసింహధూ
వల్లనుఁ డట్లు సర్వగుణవైభవ మెవ్వరికైనఁ గల్గునే. ౧౦

హాసము—

క॥ చేకొని యక్రూరములగు । నాకార వికారచేష్టలాలోకింపన్
కైకొను మనోవికాస । స్వీకారము హాసమయ్యె వినుమెట్లన్నన్, ౧౧.

చ॥ అదె యిదె వచ్చె వచ్చె నరసాధిపుఁ డాడియటంచుఁ జాళిమ
ల్పెదరి బరీసుఁ జేగునడఁ జెంపరిఖానులు వెన్కముందుగాఁ
గదిసి హయాళి నెక్కి హయకంధరముల్ వడగానకప్పుడే
చదియుచు వాజిమస్తములశ్రుళఠించుభ్రాంతిఁ గొంతరెంతయున్, ౧౨.

శోకము—

క॥ హితజన విరహవ్యథచే । నతిశయమై జనుఁడు మాన సాంభోజమునం
బ్రతిదినము పొడము దుఃఖం । బతిభూమి వహింపశోక మగునెట్లన్నన్, ౧౩.

చ॥ పతులన్నృసింహశౌర్యశిఖి పాలుగఁ జేసిన యట్టిపాపపు
న్నతభృతికంతఙుంజలముజా అనుమమ్మనుజావపావక
ప్రతతుల పాలుసేసెనని పల్కుచు రోదన మొనర్చి ద్విష
త్సతులకు బాష్పపూరములె చాలుపనానలమున్ హరింపఁగన్, ౧౪.

ఉత్సాహము—

క॥ అత్యున్నతలోకోత్తర । కృత్యంబులు సేయ వేఁడి కృతకృత్యులన్
నిత్యము దలంచు ప్రయత్నం । బత్యంతోత్సాహమయ్యె నది యెట్లన్నన్, ౧౫.

మ॥ అసిఁ జెండాడి విపక్షవృక్షముల శౌర్యాగ్నిచ్ఛటం బేర్చి శ
స్త్రశరచ్ఛేదముల ద్రణోర్వీతలమున్ సంక్షుణ్ణముం జేసి పై
ర్యస్పృగార్ద్రింబొనరించి ప్రోదిగొనకు ద్యత్కీర్తిసస్యంబుఁ జే
వెసనిద్ధించు నెయంచుఁ బల్కు నరసార్వీనాథు యోధావళుల్, ౧౬.

భయము—

క॥ క్రూరాకారము చూచిన । నారయనేఁ ననిమ్మునమునమంగువనస్థాం
కూరాశంకనము గునది । ధారుణిలో భయమనంగఁ దగు నెట్లన్నన్, ౧౭

చ॥ అనఘనృసింహసీయరివ నావళి కేగి గుహాగ్రసుప్తుఁడై
యనిమరలం గలంగ నిభయంబడి వాలుమ నాజిగాయకా
దని సతి వెల్పి నందెలియఁ డారనిపాదుఁ బాపహస్తులం
గనివివినేఘ పక్షిఁగను క్రమ్మఱనాజియ కాఁదలంచుచున్,

జుగుప్స—

క॥ పలలాస్థిశోణితాదులఁ । బలుమాఱును జూడనరుచి భావము తోఁపం
దలఁకొత్తు నిగర్హణమది । తలపోయ జుగుప్సయనఁగఁదగు నెట్లన్నన్, ౧౯.

చ॥ తలలు సరోజముల్మెదడు తండములై క్రొన్నెత్తురు వంత్రజాలము
ల్జలఘణులస్థిఖండములు శంఖములై తగు నెత్తురేర్లలోఁ
గలభ్రష్టపాలనాచయము గ్రక్కున నెక్కి చరించు సంగర
స్థలుల నృసింహనిర్దళిత శత్రువపారస మత్తభూతముల్, ౨౦.

రోషము—

క॥ అపకారకారులగు నరు । లపరాధము నర్పనేమహామహనిషనం
బు పరిజ్వలితంబగునది । యపరిమిత క్రోధమయ్యె నది యెట్లన్నన్, ౨౧.

చ॥ స్థిరభుజ విక్రమక్రమ నృసింహ నృసింహ భవత్కరాగ్రభీ
కరకరవాలసిద్ధుఁడతిగాఢయశోరససిద్ధిఁ గోరి బం
ధురహయసింధురావళుల తోరణదుర్గకనర్గళోన్నతి
న్నరబలి వెట్టు నుర్మదసనాథరిపుక్షితినాథయోధముల్, ౨౨.

విస్మయము—

క॥ వివిధాపూర్వములగు వ । స్తువులఁ గనుంగొనిన యెడల సుజనుల మదిలోఁ
దవిలిన ప్రమోదవిస్తర । మవిరళవిస్మయమనంగనగు నెట్లన్నన్, ౨౩.

చ॥ ధరణినృసింహభూవరు ప్రతాపమహాతపమబ్జజాండక
ర్పరములు నిండి తీవ్రగతిఁ బర్వ నఖర్వసగర్వవైరిభూ
వరులు వడంకసాగుదురవార్యనవవ్యజనాతపత్రవై
ఖరులు దొలంగఁ జేయుదురు కన్నులఁ జీఁకటి గప్పుచుండఁగన్, ౨౪.

శమము—

క॥ నిరుపమవైరాగ్యామల । కిరమైనిశ్చలతపూని హృదయము దిరమై
నరులకుఁ బరిణతిఁ జెందిన । ధరలోనది శమమనంగఁదగు నెట్లన్నన్, ౨౫.

ఉ॥ ఘోరభవాదిదుఃఖములఁ గుందఁగనీక నృసింహుఁ డౌరదు
ర్వారభుజప్రతాపబంబగు విరక్తిసుఖం బొనరించె నంచు నీ
వైరులు ఘోరనుప్రై నివసించిన కాటిని నీవ గురుండవంచు నీ
పేరిటి యక్షరంబె జపింతురు శ్రీనరసింహభూవరా, ౨౬.

ఈరసములకుత్పాదన కారణము విభావమనఁగఁ గలదది ద్వివిధం
బై యాలంబనాఖ్యంబున్ । మారయ నుద్దీపనాఖ్య మనఁగ ధరిత్రిన్, ౨౭.

క॥ వనితయుఁ బతియును నాలం | బనమగు నుద్దీపనంబు ప్రాయంబును సౌ
మ్యనరుచేష్టయు మదనాదులు | ననఁదగు నేర్పులు తుహీని కగుఁ దత్త్వంబుల్. ౨౮

ఆలంబనవిభావము—

ఉ॥ ఆలరు రతిప్రతీక దమయంతి నళున్నలు చాందముందుగాఁ
నలువ సృజించి యందుకత నందన చేయు ళుకెల్లఁ దీటి నే
ర్పులవడ వోలఁ తాంగి నరసాధిపనిన్నును గూర్చి ప్రేమ సం
కలితముగాఁగ దంపతులఁ గా నొనరింపఁగఁ బోలు నెంతయున్. ౨౯

ఉద్దీపనవిభావము—ప్రాయము.

మ॥ వరవక్త్రేందు విలాస కృష్ణవవయో వర్షావసానంబునం
దరుణీశైశవసింధు లింకనెడఁద త్రత్త్వాల లక్ష్యంబులౌ
సరసాంతస్స్థితగాఢశైశములనం జన్దోయియుత్తంతికం
బరఁగుం దత్కృశిమశోభరేఖలసఁగన్ పట్టున్ వళీపుంజముల్. ౩౦

సౌష్ఠ—

క॥ చెలఁదికి మణితాటంకము | లలరెన్ ద్విజయకాంతు లతిసుందసు చూపుం
జిలుకులును శాతములుగా | నలపిడవడిఁ దీటు శాణయంత్రము లనఁగన్. ౩౧

చేష్ట—

చ॥ సుదతి నృసింహునిన్ సరలి చూచె విలాసవివర్తితాస్యయై
వదలని ప్రేమ నెత్తగిలి వచ్చె మనఃక్షేం గడటాయుఖేతిచెఁ
జెదరఁగ రింద్రదుగ్ధములు చేరిన సీకటి వోలె వాసనా
స్పదము గు వాలుఁ గొప్పు నలిచన్నులపైన సియాడుచుండఁగన్. ౩౨

తటస్థములు—

చ॥ చిగురుఁ గటాంగితోఁ జెలికు సింగిణితో నలరంప గుంపుతో
నిగనిగమించు చెంగలువ సేజముతో వడిఁ జిల్కతేజిపై
మగఁటిమి నెక్కి శూరుఁడగు మారుఁడు లోకుల కంటకాహళుల్
మ్రోగ డలతాంగిపై పెడలె నేడు నృసింహ యెఱుంగి చెప్పితిన్. ౩౩

క॥ కారణమైన విభావము | చే రసముత్పన్నమైనఁ జెలఁగెడి దానం
బ్రారూఢకటాక్షాదిక | మారయ ననుభావ మయ్యె నది యెట్లన్నన్. ౩౪

మ॥ అలసాలోలములై యచంచలములై యాకేకరాగ్రంబులై
ఘూర్ణఘూర్ణితములై యనిందితములై యానందపూర్ణంబులై

సులభాసూయము లై సుతీక్ష్ణరుచు లై సువ్యక్తరాగంబు లై
చెలువంబొందెడు చూపులింతి నెరపెన్ శ్రీనారసింహేంద్రుపై. ౩౫
క॥ పరగతసుఖదుఃఖాదుల । నరయఁగ భావించి యట్ల యలరుట సత్త్వ
స్ఫురణము తద్భవ భావము । లరయఁగ సాత్త్వికములయ్యె నవి యెట్లన్నన్. ౩౬
ఉ॥ స్తంభము చంచలత్వము వశత్వము గుం ప్రళయంబు దృగ్జలో
జ్జృంభణ మశ్రువాఁ జెమట స్వేదము గద్గదవాక్యవైఖరీ
గుంభము విస్వరత్వము తగుంబులకంబన రోమహర్షణా
రంభము కంపనత్వ వడఁకు రామకుఁ బాండురుచుల్ వివర్ణతల్. ౩౭
క॥ తలఁపఁగ రసకార్యము లై । జలజాక్షులయందుఁ బొడము సాత్త్వికభావం
బులకెనిమిదింటికేర్పడ । నలరింతుం గడఁకతో నుదాహరణంబుల్. ౩౮

స్తంభము—

చ॥ కలికి నృసింహభూవరునిఁ గన్గొని నిశ్చలగాత్రవల్లియై
బలరవిలాసచేష్టలొలయుంగలయంగ నటింపఁ జేయు నా
వలపులసూత్రధారుఁడన వద్యనృపాకృతిఁ జూచితా నని
శ్చలత వహింపఁగాఁ గదలఁజాలని జంత్రపుబొమ్మ యో యనన్. ౩౯

ప్రళయము—

ఉ॥ ఇత్తఱి సీతలోదరి వహించెన చేతనవృత్తి శారదా
చిత్తముఁ జూఱగొన్న నరసింహుఁడు నేఁడు వియోగపాండువా
గుత్తపుగుబ్బలాడి పలుకుం జవరాలి వలెం జెలంగఁగా
నత్తరలాక్షి చిత్తమున హీనరసోన్నతిఁ జూఱవెట్టెనో. ౪౦
చ॥ మగువకు నంగజానలసమగ్రము లౌనులి వేఁడి యూరుపుం
బొగలెగయన్ననించుగతి ముత్తెపుఁ జిప్పలఁ బోలు ఱెప్పల
న్నెగడు నుదశ్రుపూరములు నేత్రసరోరుహనాళ చాతురిం
డిగియె నృసింహ యింకఁ దరుణీమణిఁ గాఁగిట నాదరింపుమీ. ౪౧

స్వేదము—

చ॥ సలికిఁ జెమర్చె మేను జలజాతదళాక్షి చతుస్సముద్రము
ద్రితవసుధాధురంధరుని శ్రీనరసింహుని భావవీథిలోఁ
బ్రతిదినమున్వహించు నతిభారము వంక నొకొక సంతతా
పతదసమాస్త్రశస్త్రభవ పావకకీలల వేఁడి వంక నో. ౪౨
అమరఁ బరాంగనానఖముఖాంకితుఁడైన నృసింహభూవరుం
గ్రమలదళాక్షి చూచి తెమకమ్మున దూఱెదనన్న గద్గద.

రోషము—

కం॥ నిలు నిలుమనంగ నెవతికిఁ । బోలఁగె మనరసింహుఁ డింతితోఁ గూడినజా
లలరుభవదీయచాపము । కలుగానుగఁ ద్రిప్పి పిప్పిగాఁ గావింతున్, ౬౩.

గర్వము—

కం॥ ప్రతిరేయి కళంకాంకితునకు । సతియగు క్షోణియును తనుసతియగు రతియుం
జతురు నృసింహునిఁ జెందిన । యతిధన్యకు నాకు ననుచు నంగన నవ్వెన్, ౬౪.

కం॥ క్రమమున నిష్టానిష్టా । గమజమనస్సంభ్రమంబు గన నావేగం
బమరఁగ మనముకృతార్థ । త్వముఁ బెందిన ధృతియనంగఁ దగు నెట్లున్నన్, ౬౫

ఆవేగము—

కం॥ సతిహారము నిడ లే । కతను నితను సిద్ధిగోరియల రతిప్రలసం
గతనతుసరము గైకొను । గతిఁ గేలన తాల్చి నృపతిఁ గనుఁగొనన రిగెన్, ౬౬.

ధృతి—

కం॥ నరసింహుఁడు చేకొనినఁ । బరువడి భాసింపఁగలుసుభాగ్యమె చాలుం
జరితార్థనైతి మరునకు । గిరునకుఁ బ్రియ మేలపల్కఁ గీవ్వటె నాకున్, ౬౭.

కం॥ స్మృతియగుఁ బూర్వానుభవ । స్మృతి రాగద్వేషజనిత చేష్టాద్యనవ
స్థితి చాపలమె గొడవిన । నతిచండత యుగ్రభావమగు నెట్లున్నన్, ౬౮.

స్మృతి—

కం॥ నాటి పరిరంభసౌఖ్యము ।
బోఁటి నృసింహునిఁ బాయని । భాగ్యాధికలో, ౬౯.

చాపలము—

కం॥ వనిత నృసింహునిఁ గనుఁగొని । చక్కఁగ దిద్దున్
జనఁ జూచు మరలుఁ జెలితోఁ । సేర్పున్

ఉగ్రత—

కం॥ వలదు వలదే చెలియల । చెలికాఁడు నృసింహుఁ గూర్పు చెలిఁ గాకున్నన్
బొందుక నిట్టూర్పుఁ బోగ । వ్యాలువడిని పంబమెల్ల వెసమాయించున్, ౭౧.

కం॥ భువిలో నాకృతిగోపన । మవహిత్థమనంబు బుధుఁ డగుటది త్రపమతికిన్
వివిధోపాయాభావా । ద్వ్యవిరత భంగము విషాదమగు నెట్లున్నన్, ౭౨.

అవహిత్థ—

కం॥ హారములుగ । పులకలు దై
నీరిక లెత్తిన డాఁచును । సారెకు హారంబు జనిల శైత్యంబనుచున్, ౭౩.

త్రప-క॥ వనితన్నృసింహేంద్రుఁ బరా। కునఁ జేరఁగని శిరమువంచుకొనుఁ జెలి యెదుటన్
గనుపించెభావమని సో। మనయమునఁ గుచదుగనవసతినాఁగిన భంగిన్, ౧౪

విషాదము—

క॥ అలరులు మరునమ్ములు హిమ। జలమిందుకరోదితంబు శత్రువు దలఁపం
జలిగాడ్పు శ్రీనృసింహుం। డలిగినవాఁ డెట్టుమాను సతివకుఁ గాఁకల్, ౧౫

క॥ మదము మదిరాదికృతస। మ్మదమోహవ్యతికరంబు మఱియౌత్సుక్యం
బదనసమయాక్షమత్వము। మదనశరవినిర్ణయంబు మతియెట్లన్నన్, ౧౬

మదము—

క॥ అమరు నృసింహుని వనమున। నమితాసవరసములాని యలియౌవతముల్
భ్రమియించువాఁడు బాడును। రమణులతోఁగూడి సాంద్రరాగప్రౌఢిన్, ౧౭

ఔత్సుక్యము—

క॥ వరుఁబిలువఁబనిచి యెప్పుడె। వరుదెంచునొ యనుచుఁ దలఁచి యభిముఖియగువి
త్తరియింత పరాకైనను। నరయఁదగా లోకవిఘ్నమగు ననుక్షితిన్, ౧౮

మతి—

క॥ చెలువరొ శ్రీనరసింహుం। దలనాఁటి నృసింహమూర్తియగుఁ గాకున్నన్
దలఁచిన తావుల నెల్లను। నెఱకొని సాన్నిధ్యమెట్టు నిపుణతగలదే, ౧౯

క॥ జగతిం జిత్తనిమీలన। మగు నిద్రయనంగ మూర్ఛనంచుట మోహం
బగు బోధమెఱుకఁ జెందుట। యగణితస్మృతియత్నమంతమగు నెట్లన్నన్, ౨౦

నిద్ర—

క॥ కలనైన శ్రీనృసింహునిఁ। గలయంగలనంచుఁ గలికి కన్నులు మొగిచెం
జెలి బాహ్యేంద్రియపథమున। నలరు మనంబదుగ కుంఠనాఁగిన భంగిన్, ౨౧

మోహము—

క॥ అతనుశరహతుల సొరిగెను। సతి విరహాతపస్సమాధి నితంద్రతయై
ధృతి శ్రీనృసింహుఁ దలఁపఁగ। మతి దన్మయమగుచు మేను మఱచిన భంగిన్, ౨౨

బోధము—

క॥ తరణికులాధీశయశ। స్తరుణిజహత్త్వంబుమారి సంఫుల్లసితాం
బుధహాక్షియుజృంభితయై। చరగతి మేల్కనియె శ్రీనృసింహుఁడు గలుగన్, ౨౩

స్మృతి—

క॥ వలపెఱిఁగి రాఁడు గాఁగిటఁ। నలమఁడు నరసావనీంద్రుఁడని వగవఁ జుమీ
చెలులును జిలుకయు నెవ్వతి। వలన కనో యనుచుఁ గొంతవగ చెద నాత్మన్, ౨౪

క॥ ముదమిష్టలాభభవస । మ్మదము గుఁగతఁ గావ్యకార్యమందోద్యోగం
బదియలసత సందేహ । హృదయబహుత్వము వితర్కమొగి నెట్లన్నన్, ౭౫.

ముదము—

క॥ అలులైకి౦శుకశిఖిలో । పెంఁగుచు మున్నెంత తపముఁ జేసెనొ చెలిపై
నలినరసింహుని యురమునఁ । జెలువగు చెంగల్వదండ చేరువ గలిగెన్, ౭౬.

ఆలస్యము—

క॥ చెలులాహాశాదులకుం । బిలిచిన నరగంటఁ జూచుఁ బ్రియుఁడు నృసింహుం
డలఘునృపకుంజరుండని । యలికుంతలకుంభినీత్వమంటెనొ తానన్, ౭౭.

వితర్కము—

క॥ చెలు లెఱుఁగరాదు భావము । చెలు లెఱుఁగకయున్న మరుని చేరాయిడియోఁ
జెలులువుమనసౌకలైసను । వలచెఁ గిన్నృసింహవిభుఁడు వచ్చునొ రాఁడో, ౭౮.

క॥ అతినిద్రసుప్తియుత్తరు । లతిశయము సహింపకుండు టదియీర్ష్యయగున్
హితవస్తువు చేకూడమి । నతులాధ్యానంబు చింతయగు నెట్లన్నన్, ౭౯.

సుప్తి—

క॥ లలన నృసింహుని కౌఁగిట । నలసియొపవెల్ల నిద్ర నందెడి నెలమిన్
నెలపొందున రేముద్దులు । గులికెడి పగల్నిద్రవోవు కుముదిని పోలెన్, ౮౦.

అసూయ—

క। ఈవిక్రాలఁదంతెతనమే । లేవేళ నుబాండు శోభయెన్నయె నాకున్
కావిరికీర్త్యం । గనయని శ్రీవెలయు నృసింహునొద్దఁ జిరతరలీలన్, ౮౧.

క॥ సతిచెక్కిటఁ జెయిసేర్పఁగ । నతులకరాంగుళులు పొంజనాశ్రియుతములై
రతిపతిబాణటమించిన । శితపంచశరమ్ములనఁగఁ జెలఁగు నృసింహా, ౮౨.

క। అనయంబుఁ జేతనాచే । తనసదృశమనోభ్రమంబు దరసున్మాదం
బుఁబోల్చు ధాతుచలనము । దనరనపస్మారమనఁగఁ దగు నెట్లన్నన్, ౮౩.

ఉన్మాదము—

క॥ సినుఁ బ్రార్థించెద భ్రమరమ । చనినరసింహేంద్రుఁ దెమ్ము చనవలదో పోం
చు నననృపాలు ముఖాంబుజ । ఘనవాసనఁ దగిలిపువు గ్రమ్మఱవు గదా, ౮౪.

అపస్మృతి—

క॥ మదనగ్రహంబు సోఁకెను । సుదతీమణి దీర్ఘదృష్టిఁ జూచెడుఁ జెలులన్
ముదమొందవరతుగట్టుఁడు । మదనతిన్నృసింహనామమంత్రము కతనన్, ౮౫.

క॥ చిరతరగుణిభావంబులు । పరఁగెడు ననుభావములు విభావంబులు న
న్యరసంబులకుం గలవవి । విరచింపఁగ నొల్లనిందు విస్తరభీతిన్. ౯౬

సీ॥ ఇంక శృంగారచేష్టల నేర్పరింతు । నవి యష్టాదశాఖ్యలై యలరుచుండు
లలితగతి వీని నామములు లక్షణములు । క్రమముతోఁ దెల్పి వీని లక్ష్యములొనర్తు.

క॥ ఇల భావ హావ హేలా । విలాస మాధుర్య ధైర్య విభ్రమ లీలా
కిలికించిత మోట్టాయిత । లలితాదులు చేష్టలగుచు దలంపఁగ మఱియున్. ౯౮

సీ॥ వెలయు విబ్బోక విచ్ఛిత్తి విహృతి చకిత । హసిత కుట్టమిత కుతూహలాదులనఁగఁ
గలవు మఱియును భావంబు వెలయుచుండు మహిర సజ్ఞాన యోగ్యతా మాత్రమగుచు.

క॥ ఆదియు నీషద్వ్యక్తము గా । సుదతుల యెడ హావమయ్యె సువ్యక్తంబై
పొదలిన ననవరతంబును । నదిమిక్కిలి హేల యయ్యె నదియెట్లన్నన్. ౧౦౦

భావము—

చ॥ వరుఁ డని పేర్కొనన్ స్మరము వాంచుఁ దలోదరి సాలభంజికా
పరిణయ వేళ నెచ్చెలులఁ బాయక యొప్పఁ దియట్లు కేళికాం
తర మొనరింపఁ బోవుచను నాయెదఁ బయ్యెదఁ జేర్చి సిగ్గువం
బరఁగుఁ బ్రియాంగనానుకృతి భావన కేలికిఁ గాఁగ నిచ్చలున్. ౧౦౧

హావము—

చ॥ పడఁతి నృసింహు గీతములు పాడెడు వేళ నృసింహు నామము
న్నడుమ నడు సిగ్గుతో గురుజనుల్ నరనాథ గుణ ప్రశంసలే
ర్పడ నొనరించు చోను చిత భక్తి మెయి న్గురు సేవ సేయుచై
వడి వడి నాలకించుఁ దలవాంచుఁ బరాకగుఁ గొంత వంతగన్. ౧౦౨

హేల—

ఉ॥ మేలములాడు చుంగడు సమేలములయి చెలులెల్లఁ గూడి యో
బాలిక శ్రీనృసింహ నరపాలు వరించెద వే యటన్న నీ
లాలకయంగవల్లిఁ బులకాంకురము ల్ననలొత్తఁ జేసునం
బాలకనూరకుండెనని శంబు త్రపావృతయై నతైపడిన్. ౧౦౩

క॥ పతిఁ గని తాత్కాలికమగు । సతుల వికారము విలాస మగు సొమ్ములతో
కతిరమ్యత్వము దలఁపఁగ । నతివలకున్ మధుర భావమగు నెట్లన్నన్. ౧౦౪

విలాసము—

క॥ ఇరుగడల వెడలి సుడిగొని । తరళములయి వెలికి జిలికి తళతళమనుచున్
బరఁగు రుచిరాగ్ర భ్రూపుల । హరిణాక్షి నృసింహ విభుని కారతి సేసెన్. ౧౦౫

మాధుర్యము—

చ॥ కనుఁగవ కెంపు సాంద్రనఖ గౌరతయుం జెలువొందు నాక్రియం
గనరలి వేగ కీర్ణ మణికంకణనూపుర హారవల్లియై
మును పటికన్నఁ బొల్పగు సముజ్జ్వలతం బగెఁ బాండుపత్రయై
కొనలనిగిర్చియున్న యతికోమలవల్లి మతల్లి యోయనన్. ౧౦౬.

క॥ కులశీలాద్యవిలంఘన । మిల ధైర్యం బొడఁబడఁ బోతపు డెదఁ దడఁబడినన్
వెలయఁగ విభ్రమ మధిపుని । యలఘు కథానుకృతి లీలయగు నట్లున్నన్. ౧౦౭.

ధైర్యము—

మ॥ అతులైశ్వర్యసమగ్రుఁ డైన నరసింహాద్రీశ్వరుం డేఁగన
పితృవాచాపరతంత్రనైన తతిం బెంపొందు నే నేఁడ నా
క్షితిపాలాగ్రణిపైఁ బ్రసక్తముగ నా చిత్తంబు సంధించినా
డతనిం దప్పదొ సేఁటనుండి విషమాస్త్రాభిఖ్యుఁ డౌ నంతయన్. ౧౦౮

విభ్రమము—

చ॥ అదననృసింహుమూర్తి రమణాగ్రణి నవ్వైన సంభ్రమంబుతో
సుదతి నభోవలగ్నమునఁ జుక్కల చేరిటి కంఠమాలయున్
బొదలు కుచాంచలంబుల సముజ్జ్వల మేఖలయున్ ధరింపఁగా
నదిక్రమమయ్యెఁ గొయ్యలికి నక్రమమయ్యె విలాసవైఖరిన్. ౧౦౯.

లీల—

చ॥ ధరనకలంకభావమునఁ దామరసాహితుసింహుఁ జయించునా
హరిపదసక్తయై వెలుఁగు నారయఁ బ్రాజ్ఞకు నవ్వసుంధరా
సురతరుసూతనాథ్యు పయ శోభయొనర్చు యశఃపురంధ్రియా
వరుఁడగు శ్రీనృసింహగుణవాసనఁ దాను జెలంగు నైకటిన్. ౧౧౦.

క॥ అలుకలుకముదమున బ్రువ్వు । గిలిసెనఁ గిలికించితంబు గడు నిష్టకథా
దులనింగితమెఱిఁగించుట । దలఁపఁగ మొట్టాయితంబు డగు నట్లున్నన్. ౧౧౧.

కిలికించితము—

చ॥ పతిరచితాగసుం డదరి పాటునవచ్చి దృఢోపగూహన
స్థితినధరప్రవాళము గ్రసింపన సంభ్రమలోలహస్తయై
మతకరి చాలుఁ జాలు నికమీఁదెస రాకుమటంచు నల్కతో
నతివ బొమల్ ముడించెనయనాంబువు తెప్పల నప్పళించుచున్. ౧౧౨.

మోట్టాయితము—

చ॥ చెలులు నృసింహు గీతములు చేరికగా నపరంజివీణెలో
పలుకఁ బలికింప నూర్చుచును బాలిక యూర్పుల చేత దీపికా
కలిక చలింప నెచ్చెలులు గంటిరె మీ మృదుగానలక్ష్మికిం
దెలియఁగ మెచ్చుచున్న యది దీపిక యంచు హసించు నెంతయున్, ౧౧౩

క॥ భాసురతనువల్లివి । న్యాసము లలితమ్ము సొమ్ములల్పములయ్యున్
భాసిల్లెదు శృంగారవి । కాసము విచ్ఛిత్తి యయ్యెఁ గన నెట్లన్నన్, ౧౧౪

లలితము—

చ॥ వడియు శ్రమంబుతోడి భుజవల్లి మృదంగము మీఁదఁ జేర్చి కీ
లెడలిన నూపురంబు ఘటియింపఁగ దూతికఁ దారవిందమం
దడుగిడి కంపితస్తనరయంబున నూర్పర దోఁప నింతియ
య్యెడ నటియించి నిల్చె సభ యెల్లన నంగుని పాలు సేయుచున్, ౧౧౫

విచ్ఛిత్తి—

ఛ॥ పరిమిత భూషణంబులను ఫాలముపై నెలవంక నామముం
బరఁగ నొయారమైన యన పర్వము నచ్చె వధూలలామ దా
విరళగణేయతారలు నవీనతరేందుకళావిలాసము
న్వరుస వెలుంగఁగా విదియనాఁటి విభావరి పోల్పు కైవడిన్, ౧౧౬

క॥ పరునికథయందనాదర । మరయఁగ బిబ్బోకమయ్యె నను మతిఁ బలుకం
దరమగుతగు వేళలను । త్తర మొసఁగమి విహృతమనఁగఁ దగు నెట్లన్నన్, ౧౧౭

బిబ్బోకము—

చ॥ అతఁడు గుణాభిరాముఁ డపఁ డంగజసన్నిభుఁ డంచు నెచ్చెలు
ల్పతియగు శ్రీనృసింహనరపాలు నుతింపలతాంగి నీటుతో
బ్రతుకఁగ రంగళుల్గ్రొవి శేషోభనతచ్చరితాభిపూర్ణమై
యతిశయమందు కర్ణయుగమండవకాశ మొనర్పు కైవడిన్, ౧౧౮

విహృతము—

ఉ॥ బాలిక యల్కతోఁ శరచి పల్కక యుండియుఁ బ్రాణనాథుఁ డా
వ్వేళ శుభంతలం బొనర్పఁగడు వేగఁ జిరాయువటంచుఁ బల్కఁగాఁ
జాలక రోషముం బ్రణయసంభ్రమము న్మదిఁ దొమ్ములాడఁ నీ
లాలకకుంతలద్వయముఁ దగ్గగతిన్ ఘటియించెఁ బీనుకన్, ౧౧౯

స్తనవిలాసాని పురప్రవేశకలనానాళీకదామంబులై
తనరంగోపలి నిన్నుఁ బూచె నరసేంద్రా సాంద్ర తేజోనిధీ ౧౨౭

చింత—

మ॥ అరవిందంబు విలాస మందిరము నీహారాంశుఁ డేకోదరుం
డరయన్ గోత్రవిరోధ మేటికి ననర్హంబంచు నూహించియు
ర్వ్వరఁ బొందించు పయోధికన్య క్రియఁ జేర్చెం గేలుగండస్థలిం
దరుణీరత్నము చింతచేత నరసేంద్రా సాంద్ర తేజోనిధీ ౧౨౮

సంస్కృతి—

మ॥ వరభూషాదులపై మనంబిడక దృగ్వ్యాపార మెంతేఁ బర
స్పరసందర్శనవార్తి భిన్నమయి చూఁ బట్టంగఁ గార్యేతర
స్మరణం బేమియు లేక నిశ్చలత నీ సాంగత్యముం గోరి మా
హరిణీలోచన యాత్మయందు నరసేంద్రా నిన్ను భావించెరా ౧౨౯

గుణకీర్తనము—

మ॥ పలుకుందోడగు వీణలోఁ జెలియ నిస్పై గీతముల్ మీటి పా
య్యలిమై సీడ మెఱుంగుఁ గాయనిరహై యవ్వీణలో వాణియో
లలితాంగీ మనచిత్తముం బ్రియుఁడు కొల్లల్వేట్టెఁ గాయంచు వె
ల్వలికిం దానుబుసాడవచ్చెనఁ గన్నృట్టున్నృసింహాధిపా ౧౩౦

ఆరతి—

మ॥ నిరతం బాత్మకరాంఘ్రిబాహుసఖకాంతిస్ఫూర్తికిం దిగ్గుడై
శరణంబొందు ప్రవాళపద్మబిసపుష్పశ్రేణికిం గ్రమ్మఱ
న్నరణంబందుట హీనమంచు నొమదిక్షైత్యోపచారక్రియా
గరిమంబొల్లదు మానినీమణి కళంకశ్రీనృసింహాధిపా ౧౩౧

తాపము—

మ॥ ధవళాక్షీమణి మేను హేమలతయై స్వత్వంబు నెల్లం దవ
త్కాఁపి లోకోక్తి యటంచు నుంటి నది తథ్యంబయ్యె నెట్లన్న భ
వ్వవియోగానలతప్తమై నిబిడబాష్పాసిక్తమై డస్సియు
న్నవశోభాతిశయంబుఁ జెందె నరసేంద్రా సాంద్ర తేజోనిధీ ౧౩౨

లజ్జాత్యాగము—

మ॥ చెలి నీమూర్తిఁ లిఖించి చిత్రఫలకం బెన్నొందు బాష్పాంబుపె
చ్ఛేఁ మాపయ్యెదమీఁదఁ జేర్చుకొనునా చిత్రంబలత్యంబుగా

బళిరేకట్టినచీరయుంబగయకాఁబాటించెదైవంబటం
చలినీలాలకయార్తిఁజెందునరసింహాయింకఁబాలింపుమీ, ౧౩౩.

గమనము—

మ॥ చెలులన్వంచనచేసినీమొక్కతెయతాఁజెన్నొందనీయొద్దకు
న్నలినాక్షీమణిరాఁదలంచినవరత్నప్రోతసౌధాంగణ
స్థలులన్వెన్నెనివచ్చునిర్మితముచ్ఛాయన్నిరీక్షించినా
చ్చెలియేతెంచెనెఱుంగఁబోలుననినిల్చెన్ శ్రీనృసింహాంఘ్రిపా, ౧౩౪.

మూర్ఛ—

మ॥ బలితంబైనయనంగవేదనలచేబల్మాఱునిల్పోపకే
కలినీలాలకప్రాణముల్విడలినేత్రాంభోజయుగళంబుకం
గలయంత్రాఁకుమవచ్చియున్నెలవునంగన్నిటినేఉద్ధమై
నిలుపన్నిల్చెనృసింహభూరమణమన్నింపంగఁజూడింతటన్, ౧౩౫.

ధన్యత—

మ॥ శుకవర్గంబొకమాటలోమెలఁగెనాసూనాయుధుండాంతరం
గికుఁడైయుండెమరాళమొక్కనడకంగ్రేల్లుప్పెవరీతంబుఁజూ
యకవేడ్కన్మనుఖస్వమొందెశశిమూయబ్బాషిసేవంబుతో
నకలంకస్థితినీవుగూడనరసింహరాజకంఠీరవా, ౧౩౬.

గీ॥ తెలియశృంగారమిదియనుద్వివిధముగుచుఁ బరఁగుసంభోగవిప్రలంభంబులనఁగ
నంచుబహుభేదములనగణ్యంబుగాక యేకవిధమయ్యెసంభోగమెట్లుటన్న, ౧౩౭.

సంభోగము—

మ॥ మరుఁడాచార్యుఁడుగాఁ విశీర్ణకబరీ మాల్యాప్తపుష్పాంజలి
స్ఫురణల్గాఁదమపేలశృంగనిఃదస్తోమంబు గానంబుగా
నరమంజీరరవంబుతాళగతిగావధిల్లుశాతోదరీ
సురతవ్యత్యయవేగతాండవమొనర్చెన్గజంశీతాభీష్టముల్, ౧౩౮.

క॥ పురుషుఁడుఁదలోదకులకు నరయంగావిప్రలంభమభిలాషేర్ష్యా
విరహప్రవాసకారణ పరిణతిచేనాల్గుగతులఁబరఁగుచునుండున్, ౧౩౯.

క॥ కలయుటకుమున్నకోరిక యిలనభిలాషంబుసూన మీషర్ష్యావిరహంబౌఁ
గలసియెడఁబాయుహృదయో త్కలికప్రవాసమువిదేశగతియెట్లన్నన్, ౧౪౦.

అభిలాషము—

ఉ॥ ఆనఘుమశ్రీనృసింహుని లలితాంకతలంబున సుంతవచ్చునా
యనఘునఖాంకసంగతుల నందఁగవచ్చునృపాలమూర్తితోఁ

జనువునఁగుల్కవచ్చు గుణసంగతి మెచ్చులు చూపనచ్చునో
వనజదళాక్షియాకనకవల్లికనైవసుధన్యనాముఁగా. ౧౪౧

ఊకవత్యా—

మ॥ వదనాగ్రంబున వాణియున్నదిమమన్యాక్రువ్వనీదిందిరా
మదిరాక్షీమణియున్నదక్షులమమున్మన్నించి వీక్షింపనీ
దదిర్ఘుంగాక నృసింహనీ విపుల బాహాశ్లైమ మేనొందనో
ర్వదుభూదేవిబహుప్రియారతనినుంబ్రాధిఁపనిం కేటికిన్. ౧౪౨

విరహము—

ఉ॥ నొచ్చెలులీనృసింహ ధరణీవరుఁడెచ్చెద మంచుఁబోయిరా
రిచ్చటనీవునుంగరుణయించుక లేకలరంపగుంపులం
గ్రుచ్చెదవేలమత్ప్రియునిఁగూర్పుముమన్మథనీకుఁదద్విభుం
డెచ్చటనైయుసంగెద మదీయకటాక్షములజ్జయాస్త్రముల్. ౧౪౩

ప్రవాసము—

చ॥ చిరయశయోబభూవర నృసింహభవద్రిపుకాంత కాననాం
తరమునకేగియందునిజనాథునిఁగానక మన్మథార్తయై
వరునిసరోజపత్రమున వ్రాయనెడంగరముల్స్వేమర్పఁగా
నరయనిజాంగకంబెపగ యయ్యెనటంచుఁదలంచుదైవమున్. ౧౪౪

క॥ పలువురకొకభామినిపైఁ। దలఁపునునొకవారసతికిఁదగఁబలువురపై
వలపును మృగవిహగాదుల। కెలపురసాభాసమయ్యెఁతి నెట్లన్నన్. ౧౪౫

రసాభాసము—

చ॥ అలఘువిశీర్ణపక్షయుగమైయమితోన్నమితోర్ధ్వకాయమై
గళరవముల్దలిర్పఁబ్రియకాంతకుముద్దులుపెట్టియుబ్బునం
బలుమఱుమేడపైకెగసిపక్షముద్రిప్పుచుఁగుంచితాస్యమై
పొలఁతుకఁబిల్చువిభ్రమకపోతముహుంకృతనాదమాధురిన్. ౧౪౬

క॥ భావింపభావశాంతియు। భావోదయభావసంధిభావశబలతల్
భావంబడఁగుట పుట్టుట। ద్వైవిధ్యముబహుతయనఁగఁ దగునెట్లన్నన్. ౧౪౭

భావశాంతి—

చ॥ తలఁపఁగరాజశేఖరుఁడతఁడుతలోదరిసర్వమంగళా
కలితవునీవుమీరలొకగాత్రముకైవడిఁగూడియాడుచుం

తెలుఁగుటదెుప్పుఁగా కలుగఁ జెల్లునెమికని బోఁటి గ్రొక్కుఁగా
లలనకుఁదోఁచెబాష్పసలిలంబునివారితమానపంకమై. ౧౪౮.

భావోదయము—

ఉ॥ మేలములాడువేళలసమేలనులై చెలులెల్లఁగూడియో
బాలిక శ్రీనృసింహనర పాలువరించెదవే యటన్ననీ
లాలకయంగవల్లిఁ బులకాంకురముల్ననలొత్తనేమనం
జాలకయూరకుండెననిశంబుత్రపావృతమైన కైవడిన్. ౧౪౯.

భావసంధి—

మ॥ హరికానంగశరాలిరైయరికవేలాభీలదివ్యాశుగో
త్కరమైశౌరికిఁబాటలాబ్జకలికాదామంబులైపైరికి
న్నిరతాగ్ని ప్రభలై వెలుంగునరకానీకాధికోల్లాసభా
సురఘత్యారమణీకటాక్షములు ప్రోచున్ శ్రీనృసింహాధిపున్. ౧౫౦.

భావశబలత—

మ॥ చెలులేమందురొభావవీథినకటా శ్రీనారసింహేంద్రుకాఁ
గిలినాకెన్నఁడుగల్గునోనృపతితోఁ గ్రీడింపఁగాఁబోవుచం
చలపుంజిత్తమునేమిసేయుదుగురున్సద్భక్తిఁబ్రార్థింతునో
యలప్రాణేశ్వరుఁజూడకున్నఁబరితాపాటోపముల్మానునే. ౧౫౧.

నవరససంకరము—

మ॥ జయలక్ష్మీరతమైప్రతాపయుతమై శత్రుచ్ఛిదాధుర్యమై
ప్రయతార్తావనమైకపీంద్రగళిరైరక్తార్ద్రమైనిఘ్నునో
దయువిద్యున్నిభమైసకంపముయువంచారుస్పృహాశూన్యమై
నయమొప్పన్నరసింహఖడ్గమమరున్నానారసప్రక్రియన్. ౧౫౨

రసాధిదేవతలు—

సీ॥ హరికిశృంగారలీలాధిపత్యమొసర్చు గణనాథుహాస్యసంగతునిఁజేయుఁ
నలికలోచనునికైనధికరౌద్రమునిల్పుశక్రుపైవీరరసంబునెఱపు
యమునిపైనిదయామయత్వంబుఘటియించు జగతిమహాకాలు సభయుఁజేయు
శర్వరీంద్రునిజుగుప్సారసాన్వితుఁజేయు శతధృతి నద్భుతాన్వితునొనర్చు
శాంతి బ్రహ్మంబుఁజేర్చునిచ్చలునృసింహు।భువనభరణంబువరవిఘ్ననివహహరణ
మీశతయుభోగమునసేకనృపతిహృతియు।ననియుయశమునుమతియుబోధాతిశయము

రసవర్ణనములు—

సీ॥ మరకతానీకదంభమునశృంగారంబు హాస్యంబు ముక్తాఫలౌఘరుచులఁ
గరుణవిద్రుమవర్ణగౌరవచ్ఛలమునరౌద్రంబుకురువింద రత్నకలన
వీరంబుగోమేధికారోపితస్ఫూర్తిఁభయము వైడూర్యశోభామిషమున
భీభత్సమింద్రనీలాభాగుణంబునశాంతినిర్మలహీరకాంతిగతుల
నద్భుతముపుష్యరాగరాగాపదేశ। విలసితంబునసాకార వృత్తికాంచి
నవరసంబులువాల్చునీ భవనవీధిఁ। బ్రబలసుబలనృసింహ యోబయనృసింహ, ౧౪౪

క॥ కరుణాభయభీభత్సము। ఖరసంబులుశోకభీతిగాఢజుగుప్సా
కరములుగానరసములై। తిరమగునెట్లన్నదీనిఁదెలిపెద వరుసన్, ౧౪౫

ఉ॥ భావములంక్రియాగుణవిభాసితమై వికసద్రసోదయ
శ్రీవినివారితేతర విశేషనివేదనమైయొనర్పనీ
వావిరిదుఃఖమైనసుఖవైభవమైనవిటీవిటాలియం
దావలఁబూర్ణమైసహృదయాత్మలఁ గేవలహర్షమైతగున్, ౧౪౬

గీ॥ అలపదార్థంబులగువిభావానుభావ। సాత్త్వికాదులఁగూడి రసత్వమొందు
నవనిభావంబువాక్యార్థమనఁగనెగడి। తంతువులుగూడిపటమనఁదనరుకరణి.

మ॥ రమణీయోల్బణతాసమేతమగునీరత్యాదిభావాబ్ధిలో
నమరంబుట్టుచు మున్గుచుం దగుఁదరంగారూఢి సంచారిసం
ఘము లేతత్ప్రితిపన్నహాసముదత్కాలంబునం దైనస
త్యము రామాదులయందనాట్యమునసభ్యావాసమైభాసిలున్, ౧౪౭

శా॥ లేఖేశప్రతిమానవైభవభవభవాశ్లిష్టస్రవంతీమరు
చ్ఛాఖిస్పర్ధియశఃపరంపరపరక్ష్మాపాలకప్రాజ్యరా
జ్యాఖర్వస్వస్మయ పుంజభంజన కృపాణాకల్ప కల్పాంతవే
ళాక్షేపత్పనిబలార్కకర్కశమహోలంఘిప్రతాపోదయా, ౧౪౮

అచలజిహ్వము—

క॥ భోగాంబువాహవాహవి। భాగేహాభావుకాంగభావభవమహా
భాగమహీభాగమహా భోగావహభావహాభోగిప్రుంగవభోగా, ౧౫౦

కవిరాజవిరాజితము—

నిరుపమరూపదిలీపమనూపమసీతికలాపకలాపధర

స్మరణభవానుభవానిశమానితమానసపద్మసపద్మరటు
త్కరివరఘోటకకోటికరంభితకాంతనిశాంతనిశాంతమహో
హరిహయదిక్తరణిస్ఫురణైకవిభాధికలాధికలాభవనా.

గద్యము.

ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంకుశ
ప్రతిభాబంధుర ప్రబంధ పరనరచనాధురంధర ప్రబంధాంక
వేంకటరాయభూషణసుపుత్త్రతిమ్మరాజపౌత్త్రసకలభాషా
విశేష నిరుపమావధాన శారదామూర్తిమూర్తి ప్రణీ
తంబైన కావ్యాలంకార సంగ్రహంబను మహాప్ర
బంధంబునందు రసస్థాయిసామాన్యలక్షణంబు
ను దద్విభాగకరణంబును విభావానుభావ
సంచారిభావ ప్రపంచంబును శృంగార
చేష్టా ప్రకరణంబును నవస్థాంగణ
యంబును సంభోగ విప్రలంభ
భేదంబును రసాభాసభావ
శాంతిభావోదయభావ
సంధిభావశబలతా
సంకరతలును
రసవర్ణాధిదేవతావిశేషంబులు నన్నది.

తృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# నరసభూపాలీయము.

## కావ్యాలంకార సంగ్రహమను చతుర్థాశ్వాసము.

శ్రీకరగభీరగుణర । త్నాకరకటకాధిరాజహయపతిసేనా
భీకరభుజప్రతాప । స్వీకృతజయసాంద్రనారసింహనరేంద్రా. ౧

గీ॥ అవధరింపుము దోషంబులను వచింతు । నవియు శబ్దార్థగతములై ద్వివిధములగు
నందుఁ బదవాక్యగతములౌ నరయ శబ్ద । దోషములు వీనిలోఁ బద దోషతతులు.

సీ॥ అప్రయుక్తంబ పుష్టార్థంబు నేయార్థ మసమర్థకంబు నిరర్థకంబు
గ్రామ్యంబు విగతసంస్కారంబు గూఢార్థ మన్యార్థ మశ్లీల మప్రతీత
మప్రయోజన మక్లిష్టార్థబంధంబు సందిగ్ధంబు విపరీత ధీప్రదాయి
యవిమృష్టతరవిధేయాంశంబు పరుషంబు ననఁగ నాన్యంబులం బరసి చూడ
బదగతంబులు వెలయు సప్తదశసంఖ్య । గడలుకొన వీని లక్ష్యలక్షణము లెల్ల
విస్తరించెదఁ గవితాప్రవీణ సుకవి । నివహానిరతోపకారనిజార్ఘ్రఘణికి, ౩

క॥ ఈకవితాదోషోత్కర । మేకడనివాసఁ గుమాడ్కి నియ్యకఖిలుతో
నాకరకికుటదాతలకుమ । హాకుకవులొనర్చుకృతుల యందువసించున్, ౪

అప్రయుక్తము—

క॥ కవులుప్రయోగింపనిపద । మవనిం దగ నప్రయుక్తమగు నెట్లన్నన్
ద్రవిణకౌలబిలుండనఁ బు । ణ్యవనమహాభోగిఖేటసంస్తుతుఁడనఁగన్, ౫

అపుష్టార్థము—

క॥ ఎనయఁ బ్రకృతోపయోగం । బునఁ జెందకయున్న పద మపుష్టార్థం బౌఁ
దని మెను వింశత్యర్థా । ననువింశత్యర్థరథుని నందనుఁడనఁగన్, ౬

నేయార్థము—

క॥ ఇలఁదన సంకేతంబున । నిలిపినపద మెంచిచూడ నేయార్థం బౌ
బలుతేనెదిండిగమినగు । సలసాగరకణ్యాయానయలకలనంగన్, ౭

అసమర్థము—

క॥ ధరనప్రసిద్ధయోగం । బరసిప్రయోగించుపద మయసమర్థం బౌ
శరధరరాజనికేతను । గురుపంకజచక్రహస్తుఁ గొలుతునటన్నన్, ౮

నిరర్థకము—

క॥ ఇలఁ బదపూరణమాత్రం । బలవడినపదంబు కృతి నిరర్థకమయ్యెన్
దలఁపఁగఁ గలయాచులలిను । జ్జ్వలమగు సీతస్మవిలాససాష్టవమనఁగన్, ౯

గ్రామ్యము—

క॥ పామరులభాష గ్రామ్యము। భామినికటిగల్లములువిభాసిల్లుననన్
గోమలిచన్నులుగన్నులు। గాముని పండువులొనర్చెం గొడువడిననంగన్, ౧౦.

చ్యుతసంస్కారము—

క॥ వ్యాకరణదుష్టమగుపద। మేకడఁజ్యుతసంస్కృతాఖ్యమిది యెట్లన్నన్
శ్రీకమలకాంతపదసే। వాకర్మఠుఁడనఁగఁ గరుణవారిధియనఁగన్, ౧౧

గూఢార్థము॥ అన్యార్థము—

క॥ కృతిసఖ్యాతముగూఢం। బతిశయరూఢివ్యపేతమన్యార్థంబై
క్షితిఁదగుశోణితనయనుం। డితఁడనఁగ సమానుఁడితఁడహిధ్వజుఁడనఁగన్, ౧౨.

అశ్లీలము—

క॥ వ్రీడజుగుప్సామంగళ। శీలములగుపదములొకటఁ జెర్చిన నవియ
శ్లీలములగుఁగృతినేత। న్మాలములగు త్రివిధభేదములనాడెఁగింతున్, ౧౩

క॥ వసుదేవయోనిగ్గోపీ। విసరమహాపీనకుచసవిస్పారశ్లేష
ల్లసితుండనఁగాలిందీ। రసవిహారణకరణనిత్యరసికుండనఁగన్, ౧౪.

అప్రతీతము—

క॥ అలశాస్త్రపురాణములనె। కలశబ్దము లప్రతీతకంబగుఁగృతులం
దలఁచున్నపాకపిద్రిజగము। నెలమిననావృతముఁ జేయునీశ్వరుననఁగన్, ౧౫.

అప్రయోజనము—

క॥ అవిశేషవిధాయకమై। కవిసినపదమప్రయోజకము భూతివిభా
ధవళితహారసుతుఁగొలుతును। నవనలినహరద్విపాస్యునయమగనఁగన్, ౧౬.

క్లిష్టము—

క॥ దూరార్థముక్లిష్టంబగు। ధారుణిఁబవనాశనేంద్రధరమకటాలం
కారమణిజనకవరపు। శ్రీరమణకుమారరూపదీపితుఁడనఁగన్, ౧౭.

సందిగ్ధము—

క॥ సందిగ్ధమనఁగఁ జెలగును। సందేహాస్పదపదంబు సురధరిత్రీ
సందీపితజయశాలిపు। రందరనుతవిక్రముండు రాముఁడనంగన్, ౧౮.

విపరీతధీప్రదము—

క॥ జగతిన్విరుద్ధమతికర। మగునదివిపరీతధీప్రదాఖ్యంబనఁగాఁ
దగుఁగృతులనకులహీనుం। డగునితఁడనసంబికావిటాసక్తుఁడనన్. ౧౯.

అవిమృష్టవిధేయము—

క॥ అవిమృష్టవిధేయంబగుఁ। దవిలినవర్ణ్యాంశమప్రధానంబైనన్
నవనవసంఫుల్లలతాం। తవసంతమువచ్చెనిపుడుధరణికనంగన్, ౨౦

పరుషము—

క॥ శ్రుతికటువులైన పదములు। కృతిఁ బరుషములనఁగఁ జెలఁగు నిలఁగుభృద్విడ్జా
పతిమూర్ధధృతాధోక్షజపథి। పతిఁ గొల్తు నభీష్టసిద్ధిఫలమునకనఁగన్. ౨౧.

వాక్యదోషములు—

సీ॥ అక్రమంబు విసంధి ప్రక్రమభంగంబు పునరుక్తియుతమసంపూర్ణతరము
వాక్యసంకీర్ణంబు వ్యాకీర్ణమధికపదంబు వాచ్యవివర్జితంబు రీతి
న్యూనోపమంబధికోపమంబు సమాప్తపునరాత్తమస్థానఘనసమాస
మనియతచ్ఛందంబు యతిభంగము పతత్ప్రకర్షంబు భిన్నలింగంబు భిన్న
వచనమక్రియ సంబంధవర్జితములు। వాక్యగర్భితము ననఁగ వాక్యదోష
వితతులిరువదిరెండయి వినుతిఁ గాంచు। వీనిలక్షణలక్ష్యముల్ విస్తరింతు. ౨౨.

అక్రమము—

క॥ క్రమహీనమక్రమంబగు। సమధికమగు నితని కీర్తి శౌర్యచ్ఛాయా
సముదయము నకుందినకర। హిమకరకిరణోత్కరంబులెనయే యనఁగన్. ౨౩.

విసంధి—

క॥ అపగతలక్షణమును గ్రా। మ్యపుసంధియుఁ దగ విసంధియనఁదగు నరిగో
స్నపరగిరికినుఁడనంగా। నృపులొప్పు నరధికగుణవినిద్రతనంగన్ ౨౪.

ప్రక్రమభంగము—

గీ॥ ప్రక్రమంబు విడువఁ బ్రక్రమభంగంబు । శౌరి దానవారిఁ జక్రధారి
నభవు నమితవిభవు ననవద్యచారిత్రు। విష్ణుఁ గొల్తు జిష్ణుఁ గృష్ణు ననఁగ. ౨౫.

పునరుక్తియుతము—

క॥ ఏనయిఁగ శబ్దార్థంబులు। పునరుక్తములైన నదియె పునరుక్తియుతం
బనఁదగుఁ జక్రాంచలమున। దనుజావళిఁ ద్రుంచుఁ జక్రధరుఁడితఁడనఁగన్. ౨౬.

అపూర్ణము—

క॥ ధరలోఁ గ్రియాన్వయంబుల। సరిపోనిదపూర్ణమనఁగ సన్నుతికెక్కెన్
నరపతియొసఁగు ను ద్రవ్యము। పరఁగఁగ నౌదార్యశాలి బహుళము ననఁగన్. ౨౭

వాక్యసంకీర్ణము—

క॥ ఏకపదవాక్యాంతరితప। దాకీర్ణము వాక్యకీర్ణమగుఁ బొగడుదురీ
భూకాంతుఁడు జనులెల్లన। నేకగుణాన్వితుఁడటంచు నిలలోననఁగన్. ౨౮.

వ్యాకీర్ణము—

క॥ భ్రాంతికరంబగు నన్వయ। మెంతయు వ్యాకీర్ణమయ్యె నిడుఁదుతిలకముం
గుంతలములఁ గాంతమునుల। తాంతంబులు సెరుకుఁ డిప్పుడంగనలనఁగన్. ౨౯.

అధికపదము—

క॥ తలఁపఁగ మిక్కిలి పదములు। గలిసిన యదియధికపదము కమలారికలా

కలితవిలాసనముల్లస । దలఘుయశోవిభవశాలియగు నితఁడనఁగన్. ౩౦.

వాచ్యవివర్జితము—

గీ॥ వాచ్యముజ్జగింపవాచ్యవివర్జితంబ । బనఁగ నెగడు నాజిన భవుఁడైనఁ
నెగడు నితనిబాహు దీప్తాసియను నెడ నాజిన భవుఁ డెగడునను చుఁ బలుక. ౩౧.

అరీతి—

క॥ రసమునకనుచితమగు పద । విసరమరీతియనఁ బొల్చు విటజనహృదయ
గ్రసనాగ్రహాగ్రహిళద్యు । ష్టిసమగ్రోదగ్రమతివశ్శృంగారమనన్. ౩౨.

న్యూనోపమము॥ అధికోపమము—

గీ॥ ఉపమ చాలకున్న న్యూనోపమంబది । కోపమాఖ్యమధికముపమయైన
హైమవసనుఁడైన హరి మేఘనిభుఁడన । వతివపల్లవితలతాభయనగ. ౩౩.

సమాప్తపునరాత్తము—

క॥ క్రమముడిగి మగుడఁ బూనిన । సమాప్తపునరాత్తమయ్యె శాశ్వతునభవుం
గమలాక్షుఁ గమలనాభుం । గమలాపతిఁ గొల్తుము క్తికై విభుననఁగన్. ౩౪.

అస్థానసమాసము—

క॥ అపదసమాసంబస్థా । నపటుసమాసంబు రిపులనిఁదుని మెదనే
నిపుడనివికటభ్రుకుటీ । విపులక్రోధాంధుఁడయ్యె వీరుండనఁగన్. ౩౫.

ఛందోభంగము॥ యతిభంగము—

క॥ ఛందము యతియుం దప్పిన । ఛందోయతిభంగములగు సంగతి నితఁడు
కుందేందువిశదయశుఁడై । మందుగఁ బూజించినాఁడు నరహరినన గన్. ౩౬.

పతత్ప్రకర్షము—

క॥ తీను తృకర్ష ముడక్కినఁ । బతత్ప్రకర్షంబుగ వయభల్లాక వృగీ
వితతివిభేదనగర్వా । యతసింహశ్శీలమీను హట్టపియనఁగన్. ౩౭.

భిన్నలింగము॥ భిన్నవచనము—

గీ॥ ఉవిదఁ బురుషుఁ బోల్ప నొకనిఁ బల్వురఁ బోల్ప । భిన్నలింగమనఁగ భిన్నవచన
మనఁగఁ జెలఁగు నింతి వనజారివలె నన । ఖడ్గము రగ వరులకరణిననఁగ. ౩౮.

అక్రియము॥ లేక - అశరీరము—

క॥ కుదఁ క్రియాశూన్యములగు । పదంబు లశరీరమనఁగఁ బరఁగు స్వభావా
స్పదమగు మధుమాసంబునఁ । బొదలు తరూత్కరము కుసుమపూర్ణంబనఁగన్. ౩౯.

సంబంధవర్జితము—

క। సంబంధవర్జితంబగు, సంబంధము విడువఁ గిరులు శైలములుతురం
గంబులు భంగంబులు సమ। రాంబుధిపరతరణి యిఱనియసిలతయనఁగన్. ౪౦.

వాక్యగర్భితము.

క॥ నడుమనొకవాక్యపద్ధతి । తొడరిననది వాక్యగర్భదోషముఖలులౌ
వెడమతులతోడి సంగతి । కడుహితమిది నీకొనర్పఁగావలదనఁగన్. ౪౧.

అర్థదోషములు—

క॥ క్రమమున నేఁకనర్థజదో । షములనెఱింగింతు సుకవిజనులకు హీనో
పమమధికోపమ మసమో । పమ మఖ్యాతోపమంబు పరుషము మఱియున్. ౪౨.

గీ॥ వ్యర్థమేకార్థము ససంశయంబ పక్ర । మము విరుద్ధంబు విరసాతిమాత్ర హేతు
రహిత నిరలంకృతాశ్లీలసహచరచ్యు । తములు భిన్నంబు నవీనిక్రమ మొనర్తు. ౪౩

హీనోపమము, అధికోపమము—

గీ॥ ఉర్విఘనునల్పుఁబోల్ప హీనోపమంబు । శ్వానమును బోలెనితఁడు విశ్వాసియనఁగ
నరయ నధికోపమంబల్పు నధికుఁబోల్పఁ । బునుకవట్టిన పేనీశుఁబోలుననఁగ. ౪౪

అసమోపమము, అఖ్యాతోపమము—

గీ॥ ఉపమ సరిపోని దిల నసమోపమంబు । హలధరుఁడు మేరుగిరిపోలెనెఱుననఁగ
విను ప్రసిద్ధంబుగానిదవిఖ్యాతోప । మంబు వదనంబు కుముదంబు మాడ్కియనఁగ ౪౫.

పరుషము—

క॥ పరుషార్థంబులుగలయది । పరుషంబను దోషమయ్యెఁబరఁగెడు నీభూ
వరు సౌందర్యమునకు వే । మరు సరియామంటఁ బడ్డమదనుండనఁగన్. ౪౬.

వ్యర్థము, ఏకార్థము—

గీ॥ అప్రయోజనంబు వ్యర్థనకౌఫేనిలం । బైన జలధి దాఁటెననిలతనయుఁ
డనన భిన్నవాక్యమరయ నేకార్థమౌ । సుగుణఖనిచరిత్రశోభియనఁగ. ౪౭.

ససంశయము—

క॥ క్రమమరిపదములు సంది । గ్ధములైన ససంశయంబు ధరణీవరుధై
ర్యము నగము గెల్చుననఁగా । నమరెడు సతి మేను మించు హసియించుననన్. ౪౮.

విరుద్ధము—

క॥ క్రమమెడలి దేశకాలా । సముచితము విరుద్ధమయ్యె సమదవిలోల
భ్రమరము చంపకవనమున । సముదంచితకైతకంబు చైత్రంబనఁగన్. ౪౯.

విరసము—

క॥ ధరననుచితరసభావము । విరసంబగు వితనిసమదవిద్వేషితిలో
దరులు వరులందుఁగందఁగ । సరసములాడుదురు ప్రేమశబరులటన్నన్. ౫౦.

అతిమాత్రము, హేతురహితము—.

క॥ క్షితిలోలోకాతీతం । బతిమాత్రమునింగినిండెనబ్జాక్షికుచ
ద్వితయమనహేతుశూన్యము । సతిఁగనుఁగొనెభృఙ్గపఙ్క్తిచనుదెంచెననన్, ౧౧,

నిరలంకృతి, అశ్లీలము—

క॥ ధరజాతిమాత్రశూన్యము । నిరలంకృతిబాహుయుతుఁడునృపుఁడనలజ్జా
కరమశ్లీలముపద్మిని । సరసాంగజగృహముపద్మసారభమనఁగన్, ౧౨.

సహచరచ్యుతము—

క॥ సరిగాసరిగానిదియు । ర్వరపైఁబొందింపసహచరభ్రష్టంబౌఁ
బరఁగునెలచేతగగనం । బరుదుగఫేనంబుచేలసంబుధియనఁగన్, ౧౩.

భిన్నము—

క॥ భిన్నంబగుసంబంధవి । భిన్నంబీతనివిరోధిపృథ్వీశ్వరుఁడా
పన్నుండైతననుజురున । నన్నలినజు వ్రాత శూన్యమని పల్కుననన్, ౧౪,

క॥ రసములువాచ్యము లైనను । వెసనదియునుదోషమయ్యెవిప్రులొగ్రరణం
బసదృశభీభత్సరసో । ల్లసితముశృంగారసహితలలనయనంగన్, ౧౫,

గీ॥ ఇంకగుణములువివరింతునివియుఁగృతుల । వారసిశ్లేషప్రసాదమాధుర్యసౌకు
మార్యసమతార్థదీపనౌదార్యకాంతు । లనఁగనోజస్సమాధులువనఁజెలంగు, ౧౬.

క॥ ఇలసంధిగూడిపదములు । నెలకొనియొకపదమురీతినిలిచినశ్లేషం
బలరుఁబ్రసిద్ధపదంబుల । సలఘూక్తిప్రసాదమయ్యెనదియెట్లన్నన్, ౧౭,

శ్లేషము—

శా॥ ఆలావణ్యమగణ్యమాగుణగణంబవ్యాజమాతేజము
జ్జ్వలంబావినయంబమేయతర మావీర్యంబనిర్వాచ్యమా
యాలాపంబతిసత్యమావితరణం బాశాంతవిశ్రాంతమా
శీలంబార్జవమూలమెన్నఁదరమేశ్రీనారసింహాధిపున్, ౧౮,

ప్రసాదము—

ఉ॥ ముంగిటిపెన్నిధానమిలుముందటికల్పకమర్థికోటికిం
గొంగుపసిండిచెంగటనకూడినబంగరుకొండదొడ్డిలో
నంగలకామధేనువదనంబెరయాఁగలులేసిచొక్కపుం
దంగెడిజున్నునీవితరణంబునృసింహనృపాలశేఖరా, ౧౯.

క॥ సరసములగువాక్యంబులు । వరుసనువేర్వేఱమించువగమాధుర్యం
బరయఁగబొట్లపెలుందుల । నరుదగునదిసౌకుమార్యమదియెట్లన్నన్, ౨౦.

మాధుర్యము —

చ॥ అనయము యంత్రమత్స్యమున్నొకమ్మున శ్రీనరసింహుఁడేయఁగా
వెనుకకుఁ బాఱిపుల్ల అవివేషము మూర్ఛిలంబుహారికా
ననమున నేగి సిగ్గు ననణంగి భరంపడి వీగి తావిమం
జెనసిన తిన్నఁబించిన మలిఁ విభ్రమించెను రాసులన్నియున్॥ ౬౧

సౌకుమార్యము —

ఉ॥ చెందొవవిందు మందువలెఁ జింపురు చింగఁ జందనంబువె
చ్చందన మొందు నిందుముఖి చందము డెందము నందలంపసీ
యందము నందెనందనమునందు మిళిందము పొందు పొందికం
జెందె నృసింహుఁ గాఁగిటను జేర్పుము ముందుగ మందగామినిన్॥ ౬౨

క॥ లలితార్థభంగిఁ బాదం। బులు నాల్గిట నేకసరణిఁ బొదువ సమతయా
నిలనర్థము వ్యక్తంబై। నలువొందిన యర్థదీపనం బెట్లన్నన్॥ ౬౩

సమత —

సీ॥ శరవేగములు లేవె చలయంత్రపాఠీనపాటనక్రియకు నేర్పడవు గాక
చాతుర్యములు లేవె శారదాభండారచోరకారశ్రీకిఁ జొరవు గాక
వితరణంబులు లేవె వివిధయాచకనృపాలకకంఠదఘ్నములు కావు గాక
సామర్థ్యములు లేవె సరివన్యపథయూనశాసనప్రౌఢికిఁ జనవు గాక
తొలుత గడిదుర్గములనున్న దొరలు లేరె। మహిమ నీమాడ్కి గదనదుర్మదసపాద
సారసప్తాంగహారణులు లేరు గాక। నరసుతాటోప యోబయనరసభూప॥ ౬౪

అర్థవ్యక్తి —

సీ॥ నలువొందు శశమనేంద్రుని నాగంబు సాటిగా సామజంబుల నెల్ల సంతరించి
విఖ్యాతి కెక్కిన వెలిమావు సాటిగా సైంధవముల నెల్ల సవరణించి
మహిమ మించిన మింటి మ్రాఁకుల సాటిగా నిల నెల్ల యేఱుల నిరవుకొల్పి
స్వర్గసృష్టికిఁ బ్రతిసృష్టి సలుపు కీర్తి। వసుధఁ గౌశికగోత్రపావనుఁడవైన
నీకతగుఁ గాక మఱియన్యనృపులకగునె। నరసగుణహార యోబయనరసధీర ౬౫

క॥ కతిపయసంయుక్తాక్షర। పతతంబౌ దార్ఢ్యము యొప్పి విమలవిచిత్రా
యతవర్ణావృత్తిం గల। యతిమృదుబంధంబు కాంతి యగు నెట్లన్నన్॥

ఔదార్యము —

చ॥ ఎదిరిన యోబశౌరి పరసేనకు నిక్కితిఁ నిజాంశుపఙ్క్తికి
న్నరసనవారోన్నిశీతచేఝుమాల్కొన కేగినఁదబ్రాఘంబున

త్సదనము నాక్రమించి రభసంబున నావృషభాదిరాడ్ద్విజ
స్వేదజజీవయజాండజముల వేవెతలం గడతేర్చెయా నృసింహా. ౬౪

కాంతి—

సీ॥ నెలవంకతోడివిస్తైలవంక గలమేటి నెలవంకరహితాంశునియతిఁ బెగడి
ననయమ్ము వాసిఁ గన్నయమ్ము గలయింతి ననయమ్ము బాల్చువానన్నఁ జెనకి
కడలేక తరిగొండకడలేక డఁకద్రోయు కడలేక మైనసిఁ గడల గెల్చి
కపురాలవన్నె చొక్కపురాలనగు మేని కపురాలపోతఁ బింకంబు నణఁచి
తనరుచులు లోకములు నిండఁ దనరుచుండు। లాటకరహాటలలనాలలాటఫలక
మలయజమ్మైన నీయునిర్మలయశంబు లమితగుణసాంద్ర నారసింహక్షితీంద్ర. ౬౫

క॥ విలసితసమాసభరితో। జ్జ్వలబంధంబోజమయ్యె సరియాన్యగుణం
బులు నటివేఁటొక్కటి పై। నలరింప సమాధియయ్యె నదియెట్లన్నన్. ౬౬

ఓజము—

సీ॥ మందారబిసకందకుందాదిసిద్ధబృందబృందారకాస్తోభితయశుఁడు
హాలావిజితహాలహాలాశనోత్తాలతాలాంకభుజదండతాండవుండు
దీనావననిదానదానాంబుజనదీనదీనాథపరిణయస్థితివిధాయి
భీమాసురవిరామరామాతిశయధామధామాంబకనిభాసిదారితారి
రాజమాత్రుఁడె వసుధాధిరాజమకుట। నికటవికటమహానీలనికరసుకర
మధుకరకదంబితాంఘ్రిపద్మద్వయుండు సరసగుణహారి యోబయనరసశౌరి. ౬౭

సమాధి—

అలబలీంద్రుని చేత నడుగు వెట్టఁగ నేర్చి ధారాధరను చేలసేరు నోచి
కానిను చేఁగంచుకముఁ బూనగా నేర్చి యెలమి దధీచి చేసెన్ను బలిసి
క్షీరాంబురాశిఁ ద్రచ్చిన వెన్న నీఁజేరి నైలింపగ చెన్నఁ బాఁజెరిగి
కల్పపాదపఫలోత్కరముఁ జవిగాంచి వనజారి నెవ్వనననఁగి తెనఁగి
ధరణిఁ ద్రోదెవహించిన దానకన్య। సకలయాచకబాంధవస్ఫురితసిల్ల
నీకరగ్రహణావాప్తి నెరసె నార। వైరిగజసింహ యోబయ నారసింహ. ౬౮

గీ॥ ఇఁక నలంకారనికరంబు తేర్పరింతు। సవియుఁ గవితాలతాంగికి హారకటక
కంకణాదుల క్రియ నలంకరణకరణ। పరిణతుల చేసలంకారభావమొందు. ౬౯

క॥ ఇవియును శబ్దార్థగంబుల। ద్వివిధములై క్రమముతోడ వెలయును నుప్రా
సవిశేషంబులను పమా। దివిశేషమ్ములను గావ్యదీపితసరణిన్. ౭౦

సింహావలోకనముక్తపదగ్రస్తము—

క॥ మనవేటికి నూతనమా । తనమ్మాయెడఁబ్రేమదనకుదక్కినసుమా
నను మానకదయదనరం । దనరంతులుమానినరసభవురమ్మనవే. ౯౪.

పద్మబంధము—

చ॥ కనుఁగొనరేకులెన్మిదియుఁ గణికకచుట్టిడి గ్రగ్గరాంఘ్రులి
న్ననుపటికియేడునణాములునంగడయేడుఁ బ్రవేశనిగాలు
ల్పనుపడ నాల్గుదిగ్దళములన్నిఖియించివిదిగ్దళంబులం
జెనయఁగఁబాదమధ్యగములేదునుట్రాయఁగఁబద్మబంధమా, ౯౫.

స్రగ్ధర—

రామాకశ్రీసమగ్రారణకృతభయముదారిసక్తానమారా
రామారక్తానసద్రాష్ట్రిభగణపటిమాత్రానకుస్తీకుమారా
రామాకుస్తీకుసత్రాప్రకటతరవిచిత్రాపవిత్రానమారా
రామాసత్రానిపత్రాశ్రయనర సరుచిగ్రామస శ్రీకమారా, ౯౬.

చక్రబంధము—

క॥ పదిచుట్లునాఱురేకులు । పదిలపటిదిసుకవిపేరుపతిపేరునులోఁ
బొదలఁగనేవంవిధగుణ । విదితంబగుచక్రబంధవిధమానెటునక్, ౯౭.

శా। రక్షానాకపమూర్తిభాసురగభీరావిక్రమోహాస్పదా
దక్షారమ్యధృతిస్థిరాభరణవిద్యాకృత్యశక్తిస్వనా
వక్షఃసింధుపకన్యకానరసభవ్యాత్రిగ్మధీతంత్రిదా
దాక్షిణ్యారతనాదవైభవవినోదామేలుమనాగాశ్వదా, ౯౮.

వృత్తకందగర్భసీసము—

మహితవిద్వజ్జనమంజుకీర్తిసుతసాహిత్యప్రియుఁభావుకాత్యుదార
వితతసీమాహవవిక్రమక్రమసముద్యద్వైరినిర్భేదనాభిరామ
వినుతవిశ్రాణనవిభ్రమాపహసితానూనామరక్ష్మారుహాస్ప వేంద్ర
వినతభూపాలకవిస్ఫురన్మకుట రత్నద్యోతితాంచత్పదామహాత్మ
నిరుపమదయాపయోనిధినిరతభరిత। దారుచరితనిర్మలతరసత్యరుచిర
తరణికులమణీనరసింహాధరణిరమణ । ఘనతరగుణనిధిమనుజనులువా . ద, ౯౯.

ధ్వనిరోష్ఠసంకరము—

శా॥ భూనాథోత్తమజంభభంజన మహాభోగాఢిరామక్రియా
దానోజ్జృంభితవారిపూరభరితోద్యద్వ్యాక్షిచిత్రవజా

మానామేయసుధాబ్ధినిర్మలగుణసామ్రాద్యన్మహాయూధప
శ్రీసూత్నప్రథమానభాగ్యవరవైరివ్రాతభేదివ్రతా, ౯౦.

క॥ నీహారశిఖరిశిఖర । వ్యూహామితతుహినకణమహాహామహిమమహా
మోహాపహావిమతవరా । రోహణమణిహారనయనరూషవిహారా, ౯౧.

లయగ్రాహి—

మిత్రకులభూషణయమిత్రకులభీషణవిచిత్రమృదుభాషణచరిత్రమణిహారా
జైత్రవిశిఖాసనబల త్రిపురశాసనపవిత్రగుణభాసన గోత్రభృతిధీరా
షాత్రశుభలక్షణ సుపాత్రజనరక్షణకుశాత్రయవిచక్షణయకృత్రిమవిహారా
గోత్రసమసింధురకళత్రితవసంఘరపతత్రిరథబంధురతనుత్రభుజసారా, ౯౨.

గద్యము.

ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంకుశ
ప్రతిభాబంధుర ప్రబంధ పఠనరచనాధురంధర ప్రబంధాంక
వేంకటరాయభూషణ సుపుత్త్రతిమ్మరాజపౌత్త్ర సకలభాషా
విశేష నిరుపమావధాన శారదామూర్తిమూర్తి ప్రణీతం
బైన కావ్యాలంకారసంగ్రహంబను మహా ప్రబం
ధంబునందు ద్రివిధదోషనిర్ణయంబును గుణ
ప్రకరణంబును శబ్దాలంకారసంగ్రహంబు
నన్నది చతుర్థాశ్వాసము.

—శ్రీ—

శ్రీ



శ్రీరస్తు

# నరసభూపాలీయము.

## కావ్యాలంకార సంగ్రహము - పంచమాశ్వాసము.

శ్రీనందనసౌందర్యా । ధానందనకీర్తివిజితహరిచందన మే
ధానయనిధాన దానే । దానింతెనరణిజానరసధరణీశమణీ, ౧.

గీ॥ అవధరింపుము లక్ష్యములనెల్ల । ననఘ భవదీయనామధేయాంకితముగ
బహువిభక్తులఁ గానరింతుఁ బద్యాళి । నింకఁ జెప్పెదు నర్థభవదలంకృతుల వరుస, ౨.

వ॥ ఉపమానన్వయోపమేయోపమా స్మరణరూపక పరిణామసందేహ భ్రాంతిమ
దపహ్నవోల్లేఖోత్ప్రేక్షాతిశయోక్తిసహోక్తివినోక్తిసమాసోక్తివక్రోక్తి స్వ
భావోక్తివ్యాజోక్తిమీలన సామాన్యతద్గుణాతద్గుణ విరోధాభాసవిశేషాధి కవిభా
వనావిశేషోక్త్యసంగతి విచిత్రాన్యోన్యంబు సమతుల్యయోగితా దీపక ప్రతివ
స్తూపమా దృష్టాంతనిదర్శనావ్యతిరేక శ్లేషపరికరాక్షేప వ్యాజస్తుత్య ప్రస్తుతప్రం
శ సాపర్యాయోక్తిప్రతీపానుమానకావ్యలింగార్థాంతర న్యాసయథా సంఖ్యా
ర్థాపత్తిపరిసంఖ్యోత్తర వికల్పసముచ్చయసమాధి భావికప్రత్యనీక వ్యాఘాతప
ర్యాయసూక్ష్మోదాత్త పరివృత్తికారణ మాలైకావళీ మాలాదీపక సారరసవ
త్ప్రేయ ఊర్జస్విసమాహితంబులన డెబ్బదియలంకారంబులు అందురూపక పరి
ణామసందేహభ్రాంతిమదుల్లేఖాపహ్నవోత్ప్రేక్షా స్మరణతుల్యయోగితా దీపక
ప్రతివస్తూపమాదృష్టాంత సహోక్తివ్యతిరేక నిదర్శనాశ్లేషంబులు పదియాఱును
బ్రతీయమానౌపమ్యంబులు, సమాసోక్తి పర్యాయోక్త్యాక్షేప వ్యాజస్తుత్యుపమే
యోపమానన్వయాతిశయోక్తిపరికరా ప్రస్తుతప్రశంసానుక్త నిమిత్తవిశేషో
క్తులు పదియును ✻ బ్రతీయమానవస్తుకంబులు, రసవత్ప్రేయ ఊర్జస్విసమాహిత
భావికంబు లేనును ✻ బ్రతీయమాన రసభావంబులగు, కడమ యుక్త నిమిత్తవిశే
షోక్తిసహితంబులగు నుపమాద్యలంకారంబులు నలువదియు ✻ నస్ఫుటప్రతీయ
మానౌపమ్యరసభావంబులగునందు, ౩.

సీ॥ అవనిసాధర్మ్యంబు త్రివిధమభేదప్రధానము భేదప్రధానమరయ
నుభయప్రధానమై యొగిదీపకము తుల్యయోగితయుఁ బ్రతివస్తూపమయును
దృష్టాంతమును సహోక్తియు నిదర్శన ప్రతీపము వ్యతిరేకంబు ప్రబలు భిన్న
సామ్యము రూపక సందేహపరిణామములు భ్రాంతిమదపహ్నుతులు నభిన్న,

సామ్యధర్మంబులుల్లేఖ సంగతముగ । నుపమయుపమేయకోపమయుననన్వ
యంబుస్స్మరణంబుఁదలఁపభేదాభేద । సహితసాధర్మ్యగుణవిశిష్టములుమఱియు.

సీ॥ అతిశయోక్త్యుత్ప్రేక్షలధ్యవసితమూలలొగివిభావనవిశేషోక్తివిషమ
ములుససంగతిచిత్రములతద్గుణాన్యోన్యములుభావిక విశేషములువిరోధ
జన్యముల్వ్యాఘాతసహితంబుగాఁగసముచ్చయంబువికల్పముఁబరిసంఖ్య
మలయథాసంఖ్యమర్థాపత్తిపర్యాయభావములుపరివృత్తిప్రత్యనీక
తద్గుణసమాధులువినోక్త్యవాప్తసమములు । లునుస్వభావోక్తిలోకవర్తనభవములు
గరిమననుమానకావ్యలింగములుతర్క । జంబులర్థాంతరన్యాససంగతముగ, ౫.

సీ॥ కారణమాలికైకావళీసారమాలాదీపకంబులుల్లసితశృంఖ
లావిచిత్రత్వమాలనములువ్యాజోక్తివక్రోక్తిమీలనమపహ్నుతిభవములు
పరఁగుసమాసోక్తిపరికరంబులువిశేషణజాతచాతుర్యసంభవములు
కడమశ్లేషాద్యలంకారములుప్రోద్దితన్యాయనిరపేక్షతాయుతంబు
లీయలంకారములకెల్లఁబ్రధాన । మైనయుపమయుముందుగాననువుకొల్పి
యొకటికొకటికి భేదముల్ప్రకటములుగ । సరవినెఱిఁగింతులక్ష్మలక్ష్యమ్ముతెలిమి.

సీ॥ ఉత్ప్రేక్షవలెనసిద్ధోపమకాకనన్వయముకైవడినభిన్నంబుగాక
హీనోపమయుఁబోలెచిఁనహృద్యముగాకయుపమానమనఘమైయుండెనేని
శ్లేషంబుబలెఁబశ్లిష్టమాత్రముగాకసాధర్మ్యమైయలరూపకాదులక్రియ
వ్యంగ్యంబుగాక సామ్యమువాచ్యమగునేనినౌచిత్యముప్రతీపమట్లుదలఁప
గ్రమవిపర్యాససహితంబుగాకయున్న । నలరునుపమేయకోపమయట్లుసామ్య
ధర్మమిరుమాఱువరుసలఁదడవకున్న । నుపమయగుదీనిభేదంబులుగ్గడింతు, ౭.

గీ॥ ఒనరునదిపూర్ణయునులుప్తయుననంగ । నందునుపమానముపమేయములరుఁదత
త్సామ్యవాచకమునుగూర్పఁజాలుఁబూర్ణ । కొన్నికడమైనలుప్తయైకొమరుమిగుబం.

గీ॥ అందునుభయాఖ్యయగుఁబూర్ణయార్థిశ్రౌతి
యనఁగరఘురామసన్నిభుఁడనెడిచోట
నార్థికందర్పుఁడనుచుబోలెనలరుచుండు । నథిపుఁడనుచోటశ్రౌతియైయతిశయిల్లు.

క॥ ధరయందార్థియుఁద్రివిధాం । తరయయ్యెసమాసవాక్యతద్ధితగతయై
తిరమగువాక్యసమాసా । చరణంబులద్విధయగుచుశ్రౌతియుఁదనరుక్, ౧౦.

క॥ అలతద్ధితములయందుం । దెలియవతిప్రత్యయంబుతెలుఁగునవేమిం
గలిగినకల్పప్రత్యయ । మలరుచునయ్యార్థియందయదిగనుపట్టుక్, ౧౧.

ఉ॥ కావునఁ బూర్ణ పంచవిధకల్పనలు న్ద్రయ సామ్యధర్మమీ
త్రోవిది గూర్పకున్న దెడ శ్రౌతియునార్థియునై యథోక్తసం
భావన వాక్యయుక్తయు సమ స్తయు వాక్యసమాసతద్ధిత
శ్రీవిశదాత్మ యై ధరణి జెన్నగు నాయక సంఖ్య నెట్లనన్, ౧౨.

సమాసగతపూర్ణార్థి—

క॥ ఈవియుఁ జల్లఁదనంబును । గేవలసౌందర్యగుణము గిటికొనఁగఁగ
భావుకుఁడైన నృసింహా । త్వావల్లభుఁడమరుఁ బూర్ణచంద్రోపముఁడై, ౧౩.

వాక్యగతపూర్ణార్థి—

క॥ వెలయు జనరాండ్రతలఁపుల । వలపును నిలుపంగఁ జాలు వరరూపము సం
జెలఁగుచు నృసింహుఁడలరుల । విలుకానికి సాటియయ్యె విశ్రుతలీలన్, ౧౪.

తద్ధితగతపూర్ణార్థి—

క॥ ఏయెడలనియ్యనియ్యం । గాయలు గాచిన నృసింహు కరమర్థులకుం
బాయని వేడ్కఁ ఫలించుచు । నాయతగతిఁ గల్పకల్పమై విలసిల్లున్, ౧౫.

వాక్యగతపూర్ణశ్రౌతి—

క॥ దివియును భువియు భుజంగమ । భువనంబును నిండి విమలభూరిప్రభతో
దివిజేంద్ర తటిని యోయన । నవిరళగతిఁ బొల్చు నీదు యశము నృసింహా, ౧౬.

సమాసగతపూర్ణశ్రౌతి—

క॥ కరముల శంఖము చక్రము । నిరవుగ నురమందుఁ జెంది యిందిర దనరన్
హరివలె వెలయుదువారా । నరసాహసయోబరాజు నరసింహనృపా, ౧౭

పంచవిధానుపాత్తధర్మలుప్తోపములు—

శా॥ నీదోఃఖడ్గమహీంద్రుఁడో యనఁదగున్ని దివ్య తేజోభరం
బాదిత్యుండును బోలెఁ బొల్చు భవదీయాలాపముల్ వల్లకీ
నాదబ్రహ్మము సాటి నీ కరము మందారోపమానంబు నీ
ప్రాదుర్భావము మాధవాభ్యుదయకల్పంబౌ నృసింహాధిపా, ౧౮.

అనుపాత్తోపమానలుప్త—

సీ॥ జలదంబు గతి నిచ్చి వెలవెలఁబాఱక కలశాంబునిధిరీతిఁ గి నెరుకొనక
యీగ్రమాన్వ లెపలంబడి జిగి దప్పక సురభికై వడిఁ గొలువర సియాక
కమలారి బలేని చ్చిక్రమ్మఱఁగైకొక బలిమాడ్కి యర్థిచే భంగపడక
చండాంశుసుతుపోల్కి గుండ మార్పులుగాక వాసవమణిభాతి ద్రాసమంద
కొఱఁగ నేర్తువు యాచకవ్యూహమునకు । భూను తానూనదానవిద్యానిరూఢిఁ
బోఱఁగ నీతోడ నెవ్వానిఁ బోల్పవచ్చు । సరసగుణహార యోబయనరసధీర, ౧౯

అనుప్రాప్తవాచకలుప్త—

సీ॥ దర్పితాహితనృపోత్తములనిన్నెదిరింపఁగలరెవ్వరిరోత్తమగండబిరుద
విహతకీర్తిప్రతాపములనీచేసమకట్టునేయుభయరగండబిరుద
యరివభూతాటంకగిరిమంబునీచేదఁగలుగునేగండరగండబిరుద
పరిపంథిగంధసింధురపఙ్క్తినీమ్రోలనుండునెగండభేరుండబిరుద
యరుణపరిణతధామరామాభిరామ । రామణీయకనిర్జితప్రసవబాణ
బాణసాహిత్యపరిపాకపాకవైరి । విభవసౌభాగ్యయోబభూవిభునృసింహ. ౨౦.

గీ॥ అరుణపరిణతధామరామాభిరామ । యనెడిచోభానువైవడినలరుకాంతి
పఙ్క్తిగలవాఁడురామునిపగిదిఁబోల్చు । వాఁడుననువాచకంబవివక్షితంబు. ౨౧.

అనుప్రాప్తవాచకధర్మోపాదానలుప్త—

సీ॥ ఇటుబేసితేజీలనెనయమిన్నులతేరిజోదుపుట్టినకొండఁజూచినాఁడ
నిటునేలజేజేలకెలుకైనచెంగావిసుదసంజఁదగుకొండఁజూచినాఁడ
నిటుకోడెరాతుమైనిడ్డసొమ్ములమేఁకసొంపులీనెడుకొండఁజూచినాఁడ
నిటునల్లదేవరయింటనంటినతెల్లజోటివాయనకొండఁజూచినాఁడ
విందునంచునునీతోడియీడువానిఁ । గడకతోఁగానఁగాననుగాననముచు
నిక్కమేబాసకైననునిల్పువాఁడ । నరసుతాటోపయోబయనరసభూప. ౨౨.

అనుప్రాప్తవాచకధర్మోపమానలుప్త—

మ॥ మహితప్రాభవమానధుర్యమితవాఙ్మర్యాదమీనాంకవి
గ్రహముఖ్యాన్వయమూర్తశౌర్యరసమేఘత్యాగమైత్రీరఘూ
ద్వహమేధాన్వితమాక్తికాభరణమంత్రప్రౌఢమస్త్రాగ్రస
క్తహరిశ్రీచరణాబ్జవర్ధిలుగుణాధారానృసింహాధిపా. ౨౩.

గీ॥ అలరమీనాంకవిగ్రహుండనెడిచోట । నిందుమీనాంకుమైవలెనింపుమీఱు
విగ్రహముగల్గువాఁడనవెలయుసామ్య । వాచకోపమానంబులసూచితములు. ౨౪.

క॥ ద్వివిధంబగుసాధర్మ్యము । భువినుపమానోపమేయములకొక్కటియై
తవుటయు రెంటికిద్విధం । బవుటయనద్వితియగతియనలరుద్వివిధమై. ౨౫.

క॥ క్షితినేకార్థముశబ్ద । ద్వితయంబునసంఘటింపవెలయునువస్తు
ప్రతివస్తుతయగుబింబ । ప్రతిబింబతయర్థశబ్దపార్థక్యమునన్. ౨౬.

వస్తుప్రతివస్తూపమ—

క॥ అవనిఁబరిష్కృతమయ్యె । ప్రవివంశంబోబశౌరినరసింహనిచే
దివిచరతరుభూషితమై । నవనవగతిఁబోల్చునందనవనంబనగన్. ౨౭.

బింబప్రతిబింబోపమ —

క॥ గురుశౌర్యయుతము నాయతము । కరవాలమున నృసింహుఘనభుజ మరుణా
దరళఘనాంశుకరణ । స్ఫురణము జిహ్వాలమైన భోగియుఁ బోలెన్. ౨౮.

అనన్వయము —

క॥ సరసంబగు నొక్కటికే । ధర నుపమానోపమేయధర్మము దిరమై
పరఁగిన ననన్వయంబగు । నరయంగా దీనిలక్ష్యమూ పాదింతున్. ౨౯.

క॥ నీదయకు నీడు జోడగు । నీదయ నీజయము సాటి నీజయ మిలలో
నీదానమునకు నైనయగు । నీదానము నీకు సాటి నీ వెన్నృసింహా. ౩౦.

ఉపమేయోపమ —

క॥ నిపుణస్థితి నుపమేయం । బుపమానముఁ బోల మఱియు నుపమానంబా
యుపమేయముఁ బోలఁగఁ జను । నుపమేయోపమ యనంగ నొగి నెట్లన్నన్. ౩౧.

క॥ శరణాగతభరణంబున । నరసింహుని సాటివచ్చు నరసాహసుఁడీ
నరసింహుఁ డితనికైనయా । నరసింహుఁడె కాక యితరనరులకు వశమే. ౩౨.

స్మరణము —

క॥ ధరనొకవస్తువుఁ గన్గొని । వరుసం దత్సదృశమైన వస్తువుఁ దలఁపన్
స్మరణంబని పాటింపుదు । రరయ నలంకారవేత్తలది యెట్లన్నన్. ౩౩.

క॥ ఇలయంత్రమత్స్యమేయను । విలువూనిన శ్రీనృసింహవిభుఁ గాంచి జనుల్
తలఁపుదురు ద్రుపదకన్యా । కలితకరగ్రహణనిమిత్తకార్ముకుఁ బార్థున్. ౩౪.

రూపకము —

మ॥ అలసందేహముమాడ్కిఁ గాక యుపమేయం బెన్నఁ జెచ్చెన్నమై
యలఘూక్తిన్ విషయునాన భిన్నమతిజంబై యుండి తారోపమం
బలరంగాఁ బ్రకృతోపయోగి పరిణామారోపతుల్యంబుగా
కలయారోపితమిందు రంజనము సేయన్ రూపకం బై తగున్. ౩౫.

క॥ అరయన్ సజ్జనమతమున । నరుదగు నిరూపకంబు సావయవంబు
న్నిరవయవంబును వరుసన్ । బరంపరితమనఁగఁ ద్రివిధభావము నొందున్. ౩౬.

చ॥ అరయ సమస్తవస్తువిషయంబును నేకతలప్రవర్తియై
యరుదుగఁ బొల్చు సావయవ మవ్వలఁ గేవలమాలికాఖ్యమా
నిరవయవంబు శ్లిష్టము ను నేర్పన శ్లేషవిహీన మా పరం
పరితము తత్ప్రభేదములఁ బాయక కేవలమాలికాఖ్యమౌ. ౩౭.

క॥ కావున రూపకమిట్టవి । భావహము గు లక్షణంబుల లక్ష్యంబుల్
వావిరి నొనరుతు నీనికి । భావజధనురసమరస్థవిభాసితశ్రీలిన్. ౩౮.

క॥ అవయవియు నవయవంబులు । వివరింపఁగ సమస్తవస్తువిషయంబిలలో
నవయవి యవయవగమ్యం । బవునది యేకతలవర్తియగు నెట్లన్నన్, ౪౦

సమస్తవస్తువిషయసావయవరూపకము, మహాస్రగ్ధర—
హిమశైలద్వీపవీథీస్తంభిన మణిమహితంబిందుశంఖాభిరామం
బమరాంభోమత్తహస్త్యుద్యత్తంబకుంపలహారికంబభ్రశైవాలజాలం
బమ్మిత్రాశాకుంభినక్రంబజహాదుడుకణంబాత్తసంధ్యాప్రవాళం
బమరున్ శ్రీనారసింహోద్యత విశదయశోహారిదుగ్ధాబ్ధి వేడ్కన్, ౪౧

ఏకదేశవర్తి సావయవరూపకము—
క॥ ధరణీలక్ష్మీయనువల్లీకము । సరభసగతిపెడలినీదుచటులాసిమదో
ద్ధురచరదరిధరణిరుహం । ధరజేఘానిలము గ్రోలు నరసింహనృపా, ౪౨

క॥ అవయవిమాత్రంబున నే । కవిమతివిశ్రాంతమైనఁగన నిరవయవం
బవనిని దికేవలంబును । ద్వివిధత మాలికయు నగ్నోవిను మెట్లన్నన్, ౪౩

కేవలనిరవయవరూపకము—
క॥ ఇలనీదుకీర్తిచంద్రిక । యలఘుతరస్ఫూర్తి నలిన జాండకరండం
బులు నిండి వెల్లివిరిసె । న్నలనహుషసమానశీల నరసన్నపాలా, ౪౪

మాలానిరవయవరూపకము—
క॥ హరశిఖరిదరులభాసా । తరుశేషుచగికులనమరతరులం బెలఁగున్
ఝరులై సరులై విరులై । సరసుల మగు నీదుకీర్తి నరసింహనృపా, ౪౫

క॥ రూపకకారణమైతగు । రూపకము పరంపరితము రూపింపఁగ నం
చేపగు నాల్గువిధేవము । లాపాదించెద నుదంచితాయతపరిరితిన్, ౪౬

శ్లిష్టకేవలపరంపరితరూపకము—
క॥ సితతంబు రాజహంసలఁ । బరువెత్తఁగఁజేయు నార పటుచటులభవ
త్కరకరవాలకరాళ । స్ఫురితాంభోదము నృసింహ భూపాలమణీ, ౪౭

శ్లిష్టమాలాపరంపరితరూపకము—
క॥ కువలయవికసనహిమకరుఁ । డుచిరళదానాంబుదిగ్గజాగ్రణి పద్మో
త్సవసౌభాగ్యదివాకరుఁ । డవనిని నరసింహుఁ డితని కన్యులు సరియే, ౪౮

అశ్లిష్టకేవలపరంపరితరూపకము—
క॥ క్ష్మాపరతరవిమతద్వాడి । సతతకాంతారతతికి నేవేటి మహా
హేతిదనజ్జ్వలనోజ్జ్వల । హేతిసమీరోబధారుణేశ్వరు నరసింహా, ౪౯

అశ్లిష్టమాలాపరంపరితరూపకము—
మ॥ వనితానేత్రచకోరచంద్రికయి శోభఽ ల్లవసంతోదయం
బన్నిదంపూర్వకథాసుధాబ్ధిభుజగద్వాదత్యపూర్వాసిలం

రాడంబో యెడిచేసి తాపసులు మేలౌ మ్రోల సిద్ధించెఁగా
యాడంబోయిన తీర్థమంచు మదిలో హర్షింతు రశ్రాంతముల్. ౫౮.

అపహ్నవము—

క॥ ఉపమేయము గాదనీయిది । యుపమానమె యనఁగ నెంతయు నపహ్నవమౌ
నపుడది ప్రాగారోపము । నపహ్నవారోపము నుఛలాదియు నయ్యెన్. ౫౯.

త్రివిధాపహ్నవములు—

మ॥ గురుచక్రప్రభ గాని శౌర్యసుషమాంకూరంబు గాదిందుభా
స్వరకీర్తిద్యుతిపఙ్క్తి గాదు నిబిడాంచత్పాంచజన్యప్రభా
భరమవ్వుఁ గానటు గాన విశ్వభరణప్రారంభముం గోరియా
నరసేంద్రాకృతి నుద్భవించెఁ గమలానాథుండు విశ్వంభరన్. ౬౦.

ఉల్లేఖము—

క॥ అలరఁగ గృహీతృభేదం । బుల నొకటియె పెక్కురూపముల నెసఁగెడలం
దలపోయఁగ నుల్లేఖం । బలంకరణరాజ యయ్యె నదియెట్లన్నన్. ౬౧

క॥ బాణుఁడని బుధులు మురజి । ద్బాణుండని విమతభూమిపాలురు సుమనో
బాణుఁడని సతులు దలఁతురు । రేణాంకసమాను నోబళేంద్రునృసింహున్. ౬౨.

ఉత్ప్రేక్ష—

క॥ ఉపమేయమునకుఁ గలిగిన । యుపమానగుణక్రియాదియోగము చేనా
యుపమానమె యని తలఁచిన । నపుడది యుత్ప్రేక్ష యయ్యె నదియును ధరణిన్ ౬౩

క॥ క్రమమున వాచ్యయు నప్రతీ । యమానయు ననగుచు ద్వివిధ యగు వాచకశ
బ్దము గలుగ వాచ్య యనఁదగు । నమరఁగ లేనియెడ గమ్య యనఁదగు పరుసన్ ౬౪.

సీ॥ అలరెడు నీ రెంటియందు జాతిగుణక్రియాద్రవ్యముల వాచ్య యబ్ధిసంఖ్య
యవి నాల్గు వరుస భావాభావములఁ జెందనిలవసుసంఖ్యయౌ గొనిమిదియును
నిరువదినాలుగా హేతుఫలస్వరూపముల వేర్వేఱఁ ద్రిభంగిఁ జెంద
నందు నెన్మిది యెన్మిదగు హేతువు ఫలంబున నలరు వాచ్యగుణక్రియానిమిత్త
ములఁ బదాఱు పదాఱు నౌనల స్వరూప । గతనిమిత్తంబులకు వాచ్యగమ్యగతులు
గానఁ బదియాఱు నగు వాచ్యగ స్వరూప । మరయ గమ్యస్వరూప మష్టాఖ్య యయ్యె

క॥ అల హేతుఫలనిమిత్తం । బులకున్ గమ్యత్వమైన భువి హేతుఫలం
బులు లేక రుచిరమగునని । యలవడ గమ్యత్వమునగ దితమయ్యెన్. ౬౫

క॥ కావున నేఁబదియాఱగు । నా వాచ్యోత్ప్రేక్ష గమ్య యటు పదునేడే
దాపహ్నవమగుచు నిమిత్త । ద్వైవిధ్యమునందు గమ్య ద్వాస్థితి తెలియన్. ౬౬

క॥ హేతుస్వరూపఫలములు । నాతతగతి నెన్ని చెన్నొదయియవియునిమి
త్తాతివ్యాప్తిం బడాలుగ । నేతఱిగవ్యయమునల్పదెనిమిదియయ్యెన్. ౭౮

వ॥ ఇందు నేఁబదియాఱుభేదంబులం బోల్చు వాచ్యోత్ప్రేక్షకుం గొన్ని నామధేయంబు లెఱింగించెద. ఉపాత్తగుణనిమిత్తజాతి భావస్వరూపోత్ప్రేక్షయును పాత్త క్రియానిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్షయును పాత్తగుణనిమిత్తజాత్యభావస్వరూపోత్ప్రేక్షయును పాత్తక్రియానిమిత్తజాత్యభావస్వరూపోత్ప్రేక్షయునను పాత్త నిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్షయును పాత్తగుణనిమిత్తజాతి భావహేతూత్ప్రేక్షయు నుపాత్తక్రియానిమిత్తజాతిభావహేతూత్ప్రేక్షయు నుపాత్తగుణనిమిత్త జాత్యభావ హేతూత్ప్రేక్షయు నుపాత్తక్రియానిమిత్తజాత్యభావ హేతూత్ప్రేక్షయు నుపాత్తగుణనిమిత్తజాతి భావఫలోత్ప్రేక్షయు నుపాత్తక్రియానిమిత్త జాతిఫలోత్ప్రేక్షయు నుపాత్తగుణ నిమిత్తజాత్యభావఫలోత్ప్రేక్షయు నుపాత్తక్రియానిమిత్త జాత్యభావఫలోత్ప్రేక్షయుననఁ జతుర్దశభేదంబులం బోల్చు జాత్యుత్ప్రేక్ష ఇట్లు గుణోత్ప్రేక్షయుఁ గ్రియోత్ప్రేక్షయు ద్రవ్యోత్ప్రేక్షయు నొకరొకరు చతుర్దశభేదంబులం బొందు వాచ్యోత్ప్రేక్ష యేఁబదియాఱగు జాతియనఁగ సముదాయంబును గ్రియయనఁగఁ గృత్యంబును గుణంబనఁగ రూపాదియు ద్రవ్యంబనఁగ నొకవస్తువునగు నేతదధికాభ్యవసాయమూలంబులగు నేఁబదియాఱు భేదంబులకు నుదాహరణంబు లొనరించిన జాలియగుననుభయంబున దిఙ్మాత్రంబులలక్ష్యంబులు నిరూపించెద నెట్లనిన, ౭౯

ఉపాత్తగుణనిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్ష—

క॥ భవదీయబాహుపీఠిం । దవిలినభూదేవియుచితధవలాభమహో
త్సవకృతకుంకుమరుచిపై । భవమునసీశౌర్యశోభఁ బరఁగునృసింహా. ౮౦

ఉపాత్తక్రియానిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్ష—

క॥ నిరుపమరణదీక్షావ్రత । విరచితమగువిజయలక్ష్మి వేణియుఁ బోలెం
బరఁగుఁగ శాళభవత్కర । కరవాలమతల్లి యొబఘునునరసింహా. ౮౧

అనుపాత్తనిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్ష—

క॥ నీచరణకమలనఖరుచి । వీచికలున తారవిభవముమగుడం
బ్రోచుసమీచీనసుధా । వీచికలనఁ బొల్చునోబవిభునరసింహా. ౮౨

అనుపాత్తనిమిత్తజాత్యభావస్వరూపోత్ప్రేక్ష—

క॥ ఇలనసముద్రమువలెనీ । బలధూళియొనర్చి సమదపరిపంథివధూ
విలసితబాష్పోదకముల । జలనిధిశతకము ఘటించుజగతినృసింహా. ౮౩

జాతిహేతూత్ప్రేక్ష—

క॥ పొందిననృసింహనృపసం । క్రందనుసత్కీర్తిచేతఁ గడఁగిత్రిలోకీ

మందస్మితంబుచేబలేఁ । జెందొవచెలియంకరుచివిశేషముడంగెన్, ౭౪.

జాత్యభావహేతూత్ప్రేక్ష—

క॥ రేలరవిలేమినిరుళ్లఁ । ద్రైలోక్యంబనియుఁబోలెధాతసృజించెన్
లాలితనిరుపమతేజో । నాళీకవనాప్తుఁడైననరసింహేంద్రున్, ౭౫.

జాతిఫలోత్ప్రేక్ష—

క॥ ప్రమదమునఁజెలఁగుజయమయ । కమలకురంగస్థలంబుగావలసిచుమీ
క్రమముననరసింహేంద్రుని । సమధికభుజమధ్యమతివిశాలంబయ్యెన్, ౭౬.

జాత్యభావఫలోత్ప్రేక్ష—

క॥ తగవరులుజగతిమగువలఁ । దెగటార్పరుగాననీదుదృష్టారాతుల్
మగఁటిమిడిగవలసిచుమీ । తగభీరువులగుటయోబధరణిపనరసా, ౭౭.

క్రియాస్వరూపోత్ప్రేక్ష—

చ॥ అనఘనృసింహసీఘనజయానకజాతభయానకాధిక
ధ్వనులుగుహాగృహాగ్రముల వాలఁబ్రతిధ్వనిమేదురంబులై
తనరెదిగంతశైలములుదమ్మునెదుర్కొనువైరికోటికిన్
నినుశరణంబువేఁడుమనినేర్పునబుద్ధులునేర్పుకైవడిన్, ౭౮.

క్రియాభావస్వరూపోత్ప్రేక్ష—

చ॥ భవదరిభూమిపాలకులపాలికచెంచెతకాన్మదుర్దశ
ల్వివరముగావచింపననవీథిదయామతిపల్కనీనియ
ట్లనిరళమందమారుతచలాచలచారుపలాశహస్తము
ల్తవిలివిదుర్చుశౌర్యగుణధామనృసింహనృపాలశేఖరా, ౭౯.

క్రియాహేతూత్ప్రేక్ష—

చ॥ మొగముముడించెఁగచ్ఛపముమోమరవాంచెభుజంగపుంగవుం
డగముచలింపఁగాఁవెఱచెనాదివరాహము మోరత్రోపునం
దెగువఁబయోధిఁజొచ్చెసుదతీమకరాంకనృసింహభూపనీ
జగధభినంద్యభూభరణశక్తికృతాభిభవంబుచేబలెన్, ౮౦.

క్రియాభావహేతూత్ప్రేక్ష—

చ॥ సరసనృసింహనీయశముఁజంద్రునిఁద్రాసునఁదాతదూఁచిన
న్సరభసవృత్తినెత్తుడిగిసాత్యసిరూఢివహింపలేమినో
యరయగురుత్వహేతువలినాంకనిరంకుశలోహబంకసం
కరమునఁజెందెచంద్రుఁడు జగమ్మృగంబని మాచుచుండగన్, ౮౧.

క్రియాఫలోత్ప్రేక్ష—

చ॥ నగసుత శౌర్య వైభవ సనాథ నృసింహ ధరాధినాథ నీ
వరజ ఢక్కభేరి భాంకృతి రవంబు దివిం బరిపూర్ణమయ్యె నా
సురగణికా పరంపరకుఁ జోద్యము గాననురూపనాయక
స్థిరపరిరంభ సంభ్రమ విశేషము చెప్పఁగ నేగు కైవడిన్, ౭౨

క్రియాభావఫలోత్ప్రేక్ష—

ఉ॥ గందపుఁ గొండపైని వముగ్రమ్మెడి మౌక్తిక నిర్ఝరీ తటీ
చందన వాటిలోఁ గనక సైకత సాంద్ర గుహా గృహావళిం
జెంది ఫణీంద్రకన్యలు నృసింహుని మందయశోమరందని
ష్యందము గ్రోలుచుందురు విషాగ్ని వహింపఁగ లేమిఁ బలెన్ ౭౩

గుణస్వరూపోత్ప్రేక్ష—

క॥ నరసింహు భాగ్యసూచక । సురచిర దృక్కోణ శోణ శోభ చెలంగెన్
శరణాగత భరణాయతి । కరుడుగ సాకారమగు దయారస మనఁగన్, ౭౪

గుణాభావస్వరూపోత్ప్రేక్ష—

క॥ బలశశిహారభావలకును । బొలుపుగ మితిలేని మాడ్కి మొలబంటైతే
మ్ములబంటై మెడబంటై । తలమునుకలునయ్యె నరసధరణిప కీర్తుల్ ౭౫

గుణహేతూత్ప్రేక్ష—

మ॥ అరయన్ శ్రీనరసింహు కీర్తిచయ ముద్యన్ముఖ్య వర్ణోదయా
కరసామ్యంబున ధాత్రిపైఁ గినిసియే కాంబోలుఁ దత్సైంధవో
త్కర సౌభాగ్యముఁ దన్మహోన్నతరుచిం గారించి భాషాపర
స్థిరరూపంబయి తా సృజించె నరులన్ శ్రీకంఠ సంకాశులన్ ౭౬

గుణాభావహేతూత్ప్రేక్ష—

క॥ హరిగరిమ దెగడి సత్పథ । పరిచయలంఘన మొనర్చి భ్రమియించుఁ జుమీ
నరసింహ భూమిపాలుని । యరుదగు సత్కీర్తి యవినయంబునఁ బోలెన్, ౭౭

గుణఫలోత్ప్రేక్ష—

క॥ వడి నీకీర్తుల్ బోలెడి । కడిమిం దన కందు వెలుపు గావలసి చుమీ
కడకడలి యెడల గ్రుంకును । వెడవిల్తుని మామ యోబవిభు నరసింహా ౭౮

గుణాభావహేతూత్ప్రేక్ష—

చ॥ తెగువరి నైన చెలంగు భవదీయ కృపాణము వైరికోటి యం
దగణిత దానకేళి రతమయ్యును జీవన మీవటన్న లో

డెనిమిది సైంధవేభములనీడుగఁ దాల్చుట యొట్లుపొంచు నా
కినుకన భంబులేకునికి కింబలె శ్రీనరసింహు జైత్రవా
హినియనిలోన నింగికెగయించు నుదంచితరేణుపుంజముల్,

క॥ ధరవాచ్యోత్ప్రేక్షకు దా । హరణములివి గొన్ని కడమ యన్యకృతులయం ౯౫.
దరయఁగఁ దగు గమ్యోత్ప్రే । క్షరచింపఁగ లేదు సేర్పు చాలమి నిందున్,

అతిశయోక్తి— ౯౬.

క॥ ఉపమేయమింత దడవక । యుపమాన మెను దెలుపన తిశయోక్తికవి మహా
నిపుణోక్తిమూలమై తగు । నపరిమిత ప్రౌఢిన దియు నైదువిధములై,

గీ॥ పరఁగ సంబంధమందు సంబంధమనఁగ । మఱియసంబంధమందు సంబంధమనఁగ ౯౭.
భేదమందున భేదమ భేద భేద । భావమును గార్యహేతువిపర్యయమన,

సంబంధాసంబంధాతిశయోక్తి— ౯౮.

మ॥ అలఘుప్రౌఢిమ నీదు దానవిభవం బాలించి యాలించి ని
చ్చలు దానస్ఫురణంబు డంగె సురభూజశ్రేణి కింగ్లైనా
బలభిద్వారణగండ కాషకలన ప్రత్యగ్రలగ్నాధికో
జ్జ్వల దానంబొక వేళఁ గల్గు నరసన్నాపాలచూడామణీ,

అసంబంధసంబంధాతిశయోక్తి— ౯౯.

ఉ॥ చందనశైలసానువులఁ జాలఁ జెలంగు భుజంగబాలికా
బృందము శ్రీనృసింహవిభుఁ బేర్కొని పాడఁ దదీయగాన ని
ష్యందములాను వేడ్క జెరయంగఁ గురంగ తురంగమే గమి
న్నందగ శిప్రసంగములు మాన వ్రుదక్షిణ గంధవాహముల్,

భేదాభేదాతిశయోక్తి— ౧౦౦.

క॥ అగునాకటికర్ణభూషణ । మగు నాకుటికర్ణ వైరిహరిచందన పుం
జిగురును నీచేచిగురుం । బాగడొందుటకిది యె భేదము నృసింహనృపా.

అభేదభేదాతిశయోక్తి— ౧౦౧.

సీ॥ అమృతమూర్తికిఁ గళంకానాప్తియెట్లని మిహికాంశునిఁ గళంకరహితుఁ జేయ
లోకబాధపునకు గ్రాకార మెట్లని భానుఁ బార్వణశీతభానుఁ జేయ
మృత్యుంజయున కేల మెడచుట్టు విసమని గరళకంఠుని సితకంఠుఁ జేయ
దలపోయ చలువైన దాతకీమాలిన్యమను చితంబని ఘనుని నమలుఁ జేయ
మహితభవదీయ సత్కీర్తి మధురవిధుర । వక్రమగు బ్రహ్మసృష్టి నతిక్రమించి
కమలజాండకరండంబు గడచి వెడలె । వైరిగజసింహ యోబయనారసింహ, ౧౦౨.

కార్యకారణవిపర్యయరూపాతిశయోక్తి—

సీ॥ వెసనీప్రతాపాగ్ని వెసఁ బర్వకమున్నె పొగయు శాత్రవరాజపురవరంబు
లలపురంధ్రులభ్రూమమగ్గలింపకమున్నె ప్రజ్వలించు వైరికళత్రబాష్పనితతు
లలజలంబులు ధాత్రి నవఘలింపకమున్నె క్రేళ్లుబ్బువారియకీర్తింపఁగ
మాపంకసంకరబంకురింపకమున్నె పొడముననత్కీర్తిపుండరీక
మప్పురకపబుధశుకపికనివహానిరతి । ఫలితసరసచిరసురలరుపటిమఘటిత
కలితకరతలకుసుమితకరజనికర । గరిమమనుపోచిరాజుబఘునృసింహ, ౧౦౩.

సహోక్తి—

క॥ నిపుణతముఖ్యాన్వితమా । నుపమేయంబును సహార్థయోగాన్వితమా
నుపమానంబును జెరసినఁ । బ్రపంచితంబగు సహోక్తిరశిం సెట్లన్నన్, ౧౦౪

సీ॥ నానారిభూనాథసేనాతతులతోనె కటకముల్దాఁటుసీపటుహారవము
భీతారిజాతాసువాతాళులతోనె నెరసి కేగుని చమూధూళిరజంబు
ధీరాతివీరారిఘోరాంగములతోనె నడఁకునీకరతలోజ్జ్వలకృపాణ
మస్తారిమస్తాగ్రవిస్తారములతోనె నతిఁ బెందు తావకోన్నతశరాస
మహితనృపరాజ్యలక్ష్మివృగాతిలతోనె । వేడ్కనినుఁ జెందుసంగ్రామవిజయలక్ష్మి
యనఘతరపోచిరాజవంశాబ్ధిచంద్ర । నరనుతాటోపయోబయనరసభూప ౧౦౫.

వినోక్తి—

క॥ సంబంధిఁ బాసిమఱియొక । సంబంధికిఁ జాగుతయును చారుతయుం బ్రా
ప్తంబుగఁ బ్రజ్ఞాధికులమ । తంబున నదియగు వినోక్తి నరనెట్లన్నన్, ౧౦౬.

ఉ॥ క్రూరత లేని చూపు నెలకొన్నచిత్తారము లేనిరూపహం
కారము లేని యేపుకలకాలము పేసటు లేని ప్రాపు సం
ప్రేదితయంత్రమీనతను భేదము నన్నరిపేటతూపుని
ద్దారుణశక్తి కెపొల్చుగుణధాముఁడు సంహనృపాలశేఖరా, ౧౦౭.

అచారుతావినోక్తి—

క॥ కవి లేని రాజుకీర్తియు । రవి లేనినభంబు రూపరసభావములం
జవి లేనిభామపొందును । రవ లేని విభూషణంబు రసినరసింహా

సమాసోక్తి—

క॥ ప్రకృతంబునకు సేవణంబులు । సకలంబును సామ్యశబ్దసహితత్వమైయ
ప్రకృతముఁ దెలుపఁగ నది । సుకృతి సమాసోక్తియగు నరసింహ యెట్లన్నన్, ౧౦౯.

క॥ కలకంఠరుతులఁ పెంపుచు । స్థలములు నికిబానపదనుచుపఁబు నములఁ బెనఁగుకా
బలమతిఁ జుచుకొని ప్రొప్పు । అలనాటికిఁ గాచువిచ్యలతలునృసింహా, ౧౧౦

వక్రోక్తి—

క॥ వేరొకవివక్షఁ బలికిన । చారూక్తికి శ్లేష కాకుసంబంధముచే
వేరొకయోజన చెప్పిన । నారయ వక్రోక్తియయ్యె నదియెట్లన్నన్. ౧౧౧

ఉ॥ ఇంతిభవన్మనోజ్ఞగతిఁ డెవ్వఁడినుండినుఁ డైనఁ బద్మినీ
కాంతుఁడొ రాగశేఖరుఁడు గాని తఁడాతఁడు గాఁడు రుద్రుఁడో
కాంతలలాటలోచనుఁడు గాఁడు నృసింహుఁడు మాధవుండొ యా
న్నింతట మెచ్చితిం దెలిసి శ్రేష్ఠుఁడు మాధవుఁడౌ శుభాకృతిన్. ౧౧౨

స్వభావోక్తి—

క॥ సహృదయహృదయంగమమై । మహి నున్నదియున్నయట్లు మాటల తేటల్
బహుళంబులుగాఁ జెప్పిన । మహితోక్తియె జాతియయ్యె మది నెట్లన్నన్. ౧౧౩

సీ॥ తలచూపి మోసులై త్రాసులై తతులు కెక్కినిక్కినక్కులవలె నెరసి జెరసి
గెలకట్టి కళుకులై కెరలి పోఁకంతలై యింతలై చెంతలవిరివిఁ జెంది
జిగిదొట్టి మిట్టలై బిగువులై బుగడలై మొగడలై నిగనిగన్నిగల నెగడి
కొనలుబ్బి గుబ్బలై గుబ్బలై యపరంజికుంభలై కొండలై వండనించి (సీసు.
దొరసి యొంటొంటి నొరసి క్రిక్కిరిసి మెఱసి । యుగళితస్ఫూర్తి మొగమున కెగయు
వలుదవలిగుబ్బచన్నులో వలపులాఁడి । నేఁడు నరసింహు కౌఁగిట నెరపఁగలిగె.

వ్యాజోక్తి—

క॥ లేజరిలు వేడ్కతోన । వ్యాజసముద్భూతమైన వస్తువు నెలమిన్
వ్యాజంబుచేసి దాఁచిన । వ్యాజోక్తియనంగఁ బొల్చునది యెట్లన్నన్. ౧౧౪

క॥ బాలామణి నరసింహస్వ । పాలాగ్రణిఁ జూచి భ్రమద బాష్పావృతయై
లీలాసాధ్వసముత్థిత । కాలాగురుధూపమొంత ఘనమని పల్కెన్. ౧౧౫

మీలనము—

క॥ అవనిం బ్రబలంబగువ । స్తువుచే వస్త్వంతరంబు సొరిది నడఁగినం
గవులు మతంబున మీలన । మవునదియన్వర్థమగుచు నదియెట్లన్నన్. ౧౧౬

శా॥ నీ ధాటీవిచలత్ప్రలోద్భటభటాసీకోదయద్భీతిచే
శాఖాశాఖోత్తవనోగ్రజంతుభయముం బాటింపకాత్మన్ రిపు
త్రాసార్థశాంగనల ద్రికందరల నెల్లం జొచ్చు బంగిస్ఫటా
సాఘాద్యన్సణిప జిక్కెఁ గెప్పదురు దోశ్శక్తిన్ నృసింహాధిపా. ౧౧౭

సామాన్యము—

క॥ అవిరళగుణసామ్యంబున । నవని నివస్స్వాలరఁ బూనం దేకంబై
ప్రవిమలవస్తువు మెఱసిన । నవుసది సామాన్యమనగ నదియెట్లన్నన్. ౧౧౮

క॥ నీకీర్తికాంతలోపల । శ్రీకంఠుం డేకమైన శివుఁగాఁ గనకయా
నాకనదిజలధి కేగుం । బాకారిసమాన యోబపార్థివునరసా ౧౨౦.

తద్గుణాతద్గుణములు—

క॥ తనగుణము విడిచి యన్యము । ననఘుగుణము గొనుట తద్గుణాఖ్య మొరుగుణం
బనయము హేతువు గలిగియుఁ । గైకొనమియ యతద్గుణాఖ్యమిది యెట్లన్నన్ ౧౨౧.

తద్గుణము—

ఉ॥ కానల కేఁగి నీవిమత కాతరలోచన ప్రాణనాథుఁడుం
దాను భుజింపఁగాఁ ఫలవితానముఁ గోసెద నంచుఁ బోయి నా
నానిరవద్య కోకనద నర్మసఖాంగుళిపాటలాంశురే
ఖానిబిడంబులై నకసుగాయలె కోయు నృసింహభూవరా ౧౨౨.

అతద్గుణము—

చ॥ బలరిపుభోగ యోబనరపాలనృసింహ భవద్యశంబు చేఁ
జెలుపగు నిందులాంఛనము చెల్వగుఁ బ్రాక్తనభోగిభోగము
న్నెలుపగు రుద్రకంధరము నెప్పగు భారతికొప్పు గాఁ దత్వ
త్త్వలరిపుదర్పశోరుచివితానము దెల్పయియుండ దెన్నఁడున్ ౧౨౩.

విరోధాభాసము—

క॥ అమరవిరోధం బాభా । సముగాఁగ విరోధ మయ్యె జగతిన దియునుం
గ్రమమున జాత్యాదివిభే । దముల బహుత్వంబుఁ జెందితగు నెట్లన్నన్ ౧౨౪.

గీ॥ జాతి జాత్యాదికముతోడ జగతిఁ గ్రియ క్రియాదికముతోడ గుణము గుణాదితోడ
ద్రవ్యమును ద్రవ్యమున విరోధంబుఁ జెందఁ । బది విరోధంబులగు వీనిఁ బదిలపఱతు

జాత్యాదివిరోధ క్రియాదివిరోధములు—

సీ॥ ధారాధరంబయ్యెఁ దనరు నీకాంక్షేయ మనతవాహినికిఁ బవనమయ్యె
కమలాకరంబయ్యె సమరుసీశౌర్యంబు ఘనరాజహంసభీకరత దాల్చె
నీరంధ్రిగతి మహా వారణంబయ్యె నీసత్కీర్తి హరిఘటాసఖ్య మొందె
నవనిఁ బ్రభానిధియయ్యె నీనెమ్మను జైహాత్మకత్వంబు సంఘటించె
ధర్మాకరమయ్యెఁ బ్రతిపక్షధర్మభేది । నరనుతవిహారమయ్యెఁ గీర్తిప్రమోద
శీలమురుగోత్రభృతియయ్యె జిష్ణువగుచుఁ । జెలఁగు నీబాహుయుగము నృసింహభూప.

గుణాదివిరోధ ద్రవ్యవిరోధములు—

మ॥ తలిరుం బోఁడి సరాగయయ్యె ధవళత్వం బొందు నుచ్చైస్తనా
చలన్మాజాసహాయయయ్యె నవలయాఁ జర్చింపఁగా నార్ద్రమై

చెలువంబందియునన్యభామయగునే చేతోజసామ్రాజ్యకా
న్నలిచాక్షీమణి నేలుమింక నరసింహేంద్రా సాంద్రతేజోనిధీ, ౧౨౭.

విశేషము—

క॥ ధారుణినాధేయము నా । ధారముగా నొకట నేకతలకలితముగా
సారెకు నశక్యకరణం । బారూఢముగా విశేష మగు నట్టిన్నన్, ౧౨౮

ఆధారరహితాధేయము—

చ॥ దుగమున శ్రీనృసింహుఁ డితదుర్మదవీరవిరోధిపత్తికై
సరభసవృత్తి నత్తలము సాంద్రప్రదీప్తములయ్యెఁ బన్నగా
మరకతపద్మరాగనవమౌక్తికవిద్రుమనీలకాంతిచే
సురపథవీథి పైజనులచూడ్కికి భిత్తికచిత్రకర్మముల్, ౧౨౯

ఏకానేకగోచరము—

క॥ కలఁడనఁగలఁడన్నచోటం । గలుగున్ నృసింహుఁడవ్వానఁ గానలోరుం
గలలోన మోహిలఁ బిమ్మట । నలఘుస్థితినిచయగుడుప తెత్నృసింహా, ౧౩౦.

సీ॥ వారుణాఖండకూర్మాండమండలమును ఫ్రెంగిసటుప్కనమ్రింగవచ్చు
గంభీరఘుమఘుమారంభసంరంభదుగ్ధపయోధి పంగునిదాటవచ్చుఁ
జండికాజానేయగ డప్రకాండము త్రివ్వికజతాలున వ్రేయవచ్చుఁ
గుటిలోగ్రశతకోటికోటిసంఘాటముల్కినిశ్చితేశిల్లునమనుమవచ్చుఁ
గాని పద్యావళిక ఫీకరద్భుగ్రగ్ర । జాగ్రదనలోజ్జ్వలజ్వాల జాలజటిల
గురుభుజాశౌర్యుననుఁ జెన్కఁ దరమెయరుల । కాబళేంద్రుని నారసింహక్షితీంద్ర.

అధికము—

క॥ ఆధారంబల్పంబై । యాధేయం బధికమైన నదియల్పంబై
యాధారంబును నధికం । బైథరరండ్లు నధికమగు నెట్లున్నన్, ౧౩౨.

అధికాధేయము—

క॥ ఘనరోమకూపవాతా । యనములకుఁ బుప్పులగు ఘనజాండంబులచే
దనరుహరికుక్షినడఁగక । యనఘాబ్జత పడలెనీదు యశము నృసింహా, ౧౩౩.

అధికాధారము—

క॥ నీదుచిరపద్యకీర్తమ । హోదుగ్ధపయోధిలోన నాదిమరాజ
ప్రాదుర్భూతయశంబులు । ప్రోదింబుద్బుదములట్లు పొల్చు నృసింహా, ౧౩౪.

విభావనావిశేషోక్తులు ..

క॥ కారణము లేని కార్యము । ప్రాయాప్తమైన విభావన యెక్కు
ల్కారణములయ్యుఁ గార్యము । పేరొయుండని మహావిశేషోక్తియగున్, ౧౩౫.

విభావన—

సీ॥ నలినారి లేని వెన్నెలలు రాత్రులు లేని తారలు లత లేని కోరకములు
కొలను లేని సితాబ్జములు స్వాతి చిప్పలు లేని ముత్తెము లేటి లేని నురువు
లలరు వెల్తురు లేని వెలిమబ్బులు హిమాద్రి లేని మంచులు వార్ధి లేని సుధలు
గని లేని వజ్రము ల్గంధాద్రి లేని గంధములు పాదము లేని తారవితతు
లౌర నీ కీర్తిరుచులు మహానుభావ। భావజాకార కారుణ్యభాసమాన
మానకురురాజ రాజన్యమకుటనిహిత। చరణరాజీవ యోబభూవరునృసింహ॥ ౧౩౬

విశేషోక్తి—

క॥ అనిని నీ చాపఘనాఘన। ఘనము శరోత్కరముఁ గురియఁగఁ బటూహితరా
డ్వనితలకు నెట్టిచోద్యమొ। యనువాండవు కంకణంబు లౌబళునరసా॥ ౧౩౭

అసంగతి—

క॥ నేరుపుతోఁ గార్యంబును। గారణమును భిన్నదేశగతములు గాని
ధారుణిలోన నసంగతి। యైరంజిలు నంద్రు సుకవులది యెట్లన్నన్॥ ౧౩౮

క॥ అనిలోన నీ భుజాగ్రం। బున పపతరవారిధారనందిన నేలా
యనయంబుఁ దామువడఁకుదు। రనతారులు శ్రీనృసింహ యతిబలసింహా॥ ౧౩౯

విచిత్రాన్యోన్యములు—

క॥ స్వవిరుద్ధఫలంబునకై। యవిరళయత్నము విచిత్ర మన్యోన్యము భూ
ష్యవిభూషణభావంబునఁ। దవులుట యన్యోన్యము య్యోధర నెట్లన్నన్॥ ౧౪౦

క॥ నతిఁ జెందుదురున్నతికై। ప్రతిపభూపతులు నీ ముభవనాగ్రబహి
స్థితిఁ జెందుదురు గృహాంత। స్థితికై నరసింహ శౌర్యజితనరసింహా॥ ౧౪౧

అన్యోన్యము—

క॥ లలననృసింహునిఁ జెందెడి। తలపున మైఁ దొడవులిడఁగ దనుతఁ జెలఁగె
న్గలితవిభూషణములచే। లలితవిభూషణములం గలతచేఁ జెలఁగెన్॥ ౧౪౨

విషమము—

క॥ అవిరళవిరుద్ధ కార్యో। ద్భవము వనస్థాంకు రాభిపతన విధానం
బువిరూపఘటన మనఁగా। నవనీంద్ర విషమ మది యెట్లన్నన్॥ ౧౪౩

విరుద్ధకార్యవిషమము—

క॥ కాలాహినీలమగు నీ। వాలాహవభూమి యందు వలుచు విప్రభూ
పాలానన వైవర్ణ్యవి। భాలాభ మెనర్చు నోబపార్థివునరసా॥ ౧౪౪

అనర్థవిషమము—

చ॥ అమరుభవత్ప్రతాపతపనాతపమంబరవీథిఁబర్వఁగా
సమదవిరోధిభూరమణచంద్రముఖీ వదనారవిందముల్
క్రమమునహానిఁ బొందమియ కాదనయంబుదృగంబునిర్ఝరీ
హిమజలరూషితంబులగునెంతయు శ్రీనరసింహభూవరా, ౧౪౫.

వియోపఘటనము—

సీ॥ హయగజారూఢులై యలరురాజన్యపుంగవులేడ గవులేడఁ గంబుకంఠి
ఘనభోగభాగ్యసంగతులైనమంత్రికేసరులేడ సఖులేడఁ జంద్రవదన
సౌధవీథికలలోఁ జరియించుపువ్వుకోమలలేడమలలేడఁదలిరుబోఁడి
చీనిచీనాంబరశ్రీఁజెందుబాలికావలులేడ పలులేడ వామనయన
యనుచుఁ దాడికోఁడికాఱడవిఁబడిన। వైరిభూపాలకులదురవస్థఁజూచి
కాంతతోఁబల్కువింధ్యపక్కణకిరాతుఁ। డరిజయాటోపతోరగంటినరసభూప.

సమము—

క॥ అనురూపములగువస్తువు। లనయము నైనయంగనది సమాలంకృతియై
ఘనతరసజ్జనమతమునఁ। దనరుం గావ్యంబులందుధర నెట్లన్నన్, ౧౪౬.

చ॥ అలరు రతిన్ రతీశుదమయంతినలున్నలువొందముందుగా
నలువసృజించియందుకతనంబనచేయళుకెల్లఁదీటినే
ర్పలవడనోలతాంగి నరసాధిపనిన్నునుగూర్చి ప్రేమసం
కలితముగాఁగ దంపతులఁగానొనరింపఁగఁబోలు మెచ్చితిన్, ౧౪౭.

తుల్యయోగిత—

క॥ ప్రకృతంబులకైననున। ప్రకృతంబులకైనఁదుల్యభావముగలుగం
బ్రకటమగుఁదుల్యయోగిత। యకలంకాపమ్యగమ్యమైయెట్లన్నన్, ౧౪౮.

ప్రకృతతుల్యయోగిత—

క॥ నరసింహరాజశేఖర। నరనుతమగునీదువితరణంబునురణము
న్నిరతస్వాస్థ్యంబునఁగ్ర। మ్మఱ దేహియనంగనీక మనుచుంబరులన్, ౧౫౦.

అప్రకృతతుల్యయోగిత—

క॥ కొండలురంభాదులచనుఁ। గొండలువడినదరుచుండు ఘోరాజులనీ
చండజయపటహరవముల। జాండంబులునిండ యోబయప్రభునరసా, ౧౫౧.

దీపకము—

క॥ ప్రకృతములప్రకృతంబులుఁ। బ్రకటంబుగఁగూడితుల్యభావముఁ జెందన్

సుకవీంద్రులమతమునదీ । పకమగునిదిగమ్యసామ్యపర మెట్లన్నన్, ౧౫౨.

క॥ ధారుణిసదాళిసన్నుత । సారస్యంబగుచువిమలజలజము రాకా
నీరేజవైరిబింబము । నీరమ్యయశంబుఁబోల్చు నెమ్మినృసింహా, ౧౫౩.

ప్రతివస్తూపమ—

క॥ వేర్వేఱవాక్యయుగమునఁ । బర్వినసాధర్మ్యమమరఁబ్రఖ్యాతంబై
యుర్విం బ్రతివస్తూపమ । సర్వజ్ఞులమతమునంబుఁజను నెట్లన్నన్, ౧౫౪.

క॥ రవియొకఁడె ధూర్వంధరుఁడా । కవిసితసోవితతినడఁపఁగవిభైన్యత మో
నివహంబునడఁపనీవే । యవనినిధూర్వహుఁడవౌబయప్రభునరసా, ౧౫౫.

ధృష్టాంతము—

క॥ బింబప్రతిబింబత్వము । నంబరఁగినవాక్యయుగమునంగలసాధ
ర్మ్యంబుచెలంగినదృష్టాం । తంబగునదికృతులయందుధర నెట్లన్నన్, ౧౫౬.

క॥ అసదసురవిసరఖిశసన । రసవిస్ఫురసాహసుండు రాముఁడెధరలో
నసమసమరతలసమదా । రిసమూహవిభేదివీవెల్లినరసింహా, ౧౫౭.

నిదర్శనాలంకారము—

క॥ ధరనన్వయంబుగూడక । గతినన్నామ్యంబునెచట గమ్యముఁజేయం
బరఁగునదినిదర్శనయన । నిరవొందునుస్మృతులయందు నిదియెట్లన్నన్, ౧౫౮.

క॥ బలనదరిరాజసేనా । జలధిన్ జీవనముగ్రోలిజలధరశోభా
విలసనముదాల్చెనీయసి । యలఘురణోత్సాహసరసయాబళునరసా, ౧౫౯.

వ్యతిరేకము—

క॥ ధరనుసమానముకన్నను । నరుదగునుపమేయమదికమౌననసామ్యం
బురుభేదకారణంబై । యిరవుగవ్యతిరేకమయ్యెనదియెట్లన్నన్, ౧౬౦.

సీ॥ బహుతరాశాభ్రాంతిబయలుద్రాకకయున్నఁ గువలయద్వేషంబుఁగోరకున్న
వీటితమ్ములవిరివాటుసేయకయున్న దోషాభిఘాతుఁడై తాలఁగకున్న
జగతినందఱకునుబగలౌనర్పకయున్న వారుణీసక్తినిబాఱకున్న
ద్విజరాజపరిభవోదగ్రవృత్తిఁజేరకున్న సరసులఁసింకింపఁజాలకున్న
సాటియగువిశ్వవినుతశశ్వత్ప్రతాప । వైభవశ్వస్తమర్వారవైరిపీరుఁ
డైనయోబయనరసింహునమితభువన । భవనభృతతేజమునకబ్జబాంధవుండు.

శ్లేషము—

క॥ ప్రకృతములప్రకృతంబుల । ప్రకృతాప్రకృతములశబ్దపాటవమాత్ర
ప్రకటితసామ్యముఁబొందిన । సకలంకతశ్లేషమయ్యె నదియెటులన్నన్, ౧౬౨.

క॥ నిరతముశ్లిష్టవిశేష్యత । నరుదందుఁ బ్రకృతములును నప్రకృతములుఁ
    దరసశ్లిష్టవిశేష్యము । లరయం బ్రకృతాప్రకృతములవి యొట్లన్నన్, ౧౬౩.

ప్రకృతశ్లేషము—

క॥ పరిణతగుణాభరితములై । నిరుపమతరశాస్త్రకలననిష్క్రమములై
    యిరువగు నీధర్మంబులు । నరనుత యోబళక్షితీంద్రుమనారసింహనృపా, ౧౬౪.

అప్రకృతశ్లేషము—

క। అసదృశకాష్ఠాశ్లేషో । ల్లసితులను గ్రకరయోగలడిపులవిభా
    వసులవగు నీను తేజో । విసరము నరసింహ యోబ విభునరసింహా, ౧౬౫.

ప్రకృతాప్రకృతశ్లేషము—

క। అరిదరకరుఁడై సుమనో । వరభరణ ధురంధరుఁడై యవారితలత్స్ర
    స్థిరవాసభాసురుండై । నరసింహుఁడు వొల్చు నావి నరసింహుఁడనన్, ౧౬౬.

పరికరము—

క॥ సాకూతములై శఫలత । చేకొన్న విశేషణములు వెలఁగఁ బరికరం
    బైకృతుల వెలయుచుండును । హాకవినుస్తుత్యనసుచున దిదెట్లన్నన్, ౧౬౭.

సీ॥ దర్పితాహితనృపోత్తములనిన్నెదిరింపఁగల చెద్దిరోత్తమ గండఁడుద
    వినుతకీర్తి ప్రతాపములు నీ చేసమకట్టు నేయుభయరగండబిరుద
    యరివధూతాటంకగరిమంబు నీచేతఁ గలుగు నేగండర గండబిరుద
    పరిపంథిగంధసింధుర పఙ్క్తి నీమ్రోలనుండు నేగండభేరుండబిరుద
    యరుణపరిణతధామరామాభిరామ । రామసేయకనిర్జితప్రసవబాణ
    బాణసాహిత్యపరిపాకపాకవైరి । విభవసౌభాగ్య యోబభూవిభునృసింహ,

ఆక్షేపము—

క॥ ఫలనిష్టపపరమార్థ । స్ఫురణంగాగననణిష్టమున పరమార్థ
    స్ఫురణంబింపఁగ రెండై । యరయఁగ నాక్షేపమమరునది యెట్లన్నన్, ౧౬౯.

ఇష్టవిశేషాభాసము—

సీ॥ మదిలోనఁ బాయకుండుదునన్నఁ బునరుక్తి సేసొమ్మ నన్న గాఢకృపస్ఫూర్తి
    నినుఁ బాసినిలువ లేననన సంభావ్యంబు పతిమీసనఁగ సభోః ప్రసవవాంఛ
    యతనుడు గారించుననన సాక్షికసూక్తి చలిగాలి వేఁడన్న జనవిరుద్ధ
    మెలమినిచ్చటికి రావలయునన్న మదోక్తి చను దెంతునేనన్నఁ జాపలంబు
    వెలయుఁ ద్వదధీనయగునన్ను వేఁచునలక । లాధరుండన్న భావముపాలంభ సదృశ
    శాననేయుక్తులు నెఱుంగఁ గరుణఁ జూడు । సరసగుణహార యోబయ నరసధీర,

అనిష్టవిధ్యాభాసము—

చ॥ అలుకఁగ నేలమీరు వసుధాధిపులెన్న స్వతంత్రులైనమీ
వలదన నచ్చు మీమనసు వచ్చిన చోటికి నేగుఁ డేగిన
న్నెలకొని సేత్రిప్రియాంగనకు నీకును నూఱ్మోన లేక యుండదన
ర్మిలి సుసరంబు గాఁగ నొనరించెదఁ గాక నృసింహభూవరా. ౧౭౧

వ్యాజస్తుతి—

క॥ సతతంబు నిందచేతను । స్తుతియుక్ స్తుతిచేత నింద చొప్పడ వ్యాజ
స్తుతియై చెలువగుఁ గృతులం । దతులిత కవివినుత మగుచు నదియెట్లన్నన్. ౧౭౨

నిందాకృతస్తుతి—

సీ॥ నెఱిజీవనము లేక నింగి పైఁ భ్రమియించు మత్స్యంబు దనుము చేటు మాటు వాసి
శ్రీజగతీమాత వాగ్దేవి ఖండారంబు చూఱగాఁ గొనుట యే సుగుణితనము
వేడినవారికి వెండియు గొకపూఱువు త్తమీకుంటు రయ్యే వితరణంబు
అలయనాదిప్రవాహముల్ైనయే ల్లవఁకలు దిద్దు చే వివేకంబు కలిమి
వఱలునీకీర్తి ద్విజరాజ వైభవంబు । ఉపహరింపఁగ నీయాజ్ఞ యలరు నెంత
చోదిరాజాన్వయాంభోధి పూర్ణచంద్ర । నరనుతాటోపతోరగంట్టి నృసింహ.

స్తుతినింద—

క॥ అసమరణరంగములనీ । యసినటినటియింపఁగ దుల హాదులన్నీపలక్
వెసనొసఁగునార యెంతటి । రసికుఁడు నీ వైరి యోబరాజ నృసింహా. ౧౭౪

అప్రస్తుతప్రశంస—

క॥ తీరిన ప్రస్తుతము నఁట్రు । స్తుతవస్తువు గమ్యమగుచు సొంపొందిన పే
ర్పుతులఁ దలపోయిన ప్ర । స్తుతప్రశంసాఖ్యమయ్యె నది యెట్లన్నన్. ౧౭౫

క॥ ననలు మొనలెత్తఁ దేనెలు । చినికెంజిగురాకు గండెఁ జెదరెన లితపల్
చనువు నన పూఁ పఁగకు । ఘనమైన నృసింహుపొందు గలుగఁగఁ బోలున్. ౧౭౬

పర్యాయోక్తి—

క॥ ప్రస్తుతకార్యస్తుతిచేఁ । బ్రస్తుతకారణము దోఁప పర్యాయోక్తం
బిస్తారసుకవికావ్య । ప్రస్తుతమై చెలఁగుచుండు రహి నెట్లన్నన్. ౧౭౭

ఉ॥ చక్కెరపట్టి వేసెడి చపారసలోచన మాటనెప్పవే
చొక్కపుగుబ్బలాడి నసుఁ జొప్పడఁ బాణితలంబు జెప్పవే
చెక్కులనిగ్గులాడి యని చిల్కలు పల్కు నృసింహపూర్వపు
న్నక్కువనివిరోధి నృప మందిరచిత్రసభాపరంపరన్. ౧౭౮

ప్రత్యక్షము—

క॥ ఉపమేయమె చాలుస్ఫుర । ణుపమానంబెలయునేని నానరుఁ బ్రలీపం
బ పరిమితసుకవికృతుఁ డ । గపారవిస్ఫూర్తిఁ జెందియది యెట్లన్నన్, ౧౪౯

సీ॥ పత్త్రపథక్రమకళాచాతురి నెరపదా కమలాధికామోదకరము గాదొ
వివిధచక్రానందవిభవంబొనర్పదో సతతంబునుదయసంగతము గాదొ
యిలమహాగ్రహరాజజృంభణంబలరదో యమితతోషార్యావహము గాదొ
మహితగాంగేయధామస్ఫూర్తిఁ జెలఁగదో యచ్యుతాగ్రాకారహారి గాదొ
నీప్రతాపంబు దనవలె నిఖిలతమము । నడఁపఁగా నీదొ తానేల యరుగ దెంచు
గుంటిసారథితో నల్లకుముదవైరి । నరసుతాటోపయోబయ నరసభూప, ౧౫౦

అనుమానము—

క॥ ఘనసాధనసంపదచే । నవిరళవిస్ఫూర్తిఁ సాధ్యమనుమేయముగా
వివిధశ్లేషవిశేషా । ద్యవియుతమనుమానమయ్యె నది యెట్లన్నన్, ౧౫౧

సీ॥ కమలాక్షుఁ డీవేటి గాఁబోలుఁ గాకున్నఁ గరముల శంఖచక్రములు గలవె
కమలారి యీరాజు గాఁబోలుఁ గాకున్న సకలకలావిలాసములు గలవె
కమలాప్తుఁ డీప్రోడ గాఁబోలుఁ గాకున్న నధిగతమండలవ్యాప్తి గలదె
కమలజుఁ డీస్వామి గాఁబోలుఁ గాకున్నఁ జతురాననవచశ్శ్రీ గలదె
యనుచుఁ గొనియాడుదురు నిన్ను సంగరంగ । మాళవావంతిగౌళనేపాళచోళ
కురుకురుపాండ్యకేకయముఖక్షోణిపతులు । నరసుతాటోపయోబయ నరసభూప.

కావ్యలింగము—

క॥ హేతువు వాక్యార్థంబై । యాతతవిస్ఫూర్తిఁ బదార్థంబును నై
ఖ్యాతిగనఁ గావ్యలింగఁ । ఖ్యాతగుసత్కృతులయందు నది యెట్లన్నన్, ౧౫౩

వాక్యార్థహేతుకము—

మ॥ అరుదై పొల్పగు పోచిరాజనరసింహా యన్నయస్టాష్ట
పరమాత్రంబధి యెల్లకాలము నరుల్ వ్యాక్రుష్వవృద్ధిం చుఁబోఁ
కరులాందోళికలశ్వముల్ విభవముల్ గ్రామంబు లత్యుజ్జ్వలాం
బరముల్ సొమ్ములు పల్లకీల్ పరిణయప్రారంభసంరంభముల్, ౧౫౪

పదార్థహేతుకము—

క॥ గురునఖదళితప్రతిమా । కరికిరి త్రితటి త్రిగళితఘననవశికి ష్టా
పరితోషయుతము లైనని । యరిపురములఁ గనుక మానుహరులు నృసింహా, ౧౫౫

అర్థాంతరన్యాసము —

గీ॥ మహిని శేషంబుచేత సామాన్యము సుబ్రు। సక్త సామాన్యమున విశేషము సమర్థి
తముగ నర్థాంతరన్యాసమమరుచుండు। నెలమి రెండువిధంబులై యెట్లటన్న ౧౫౬

విశేషసమర్థిత సామాన్యార్థాంతరన్యాసము —

క॥ విమలాత్ముఁడె చెడుపనుండిన। హిమలుంపఁగు నెట్లటన్న వినుము సురాగో
రమువ్రఁ గరించియు నీయశ। మమలస్థితిగాదె యోబయప్రభునరసా ౧౫౭

సామాన్యసమర్థిత విశేషార్థాంతరన్యాసము —

చ॥ జలనిధి రాజకన్యక నుసన్న మెలంగుచునుండు వాణియున్
మెలఁగును నోటలోన నెలమిం జెయిసన్నఁ జరించుఁ గీర్తి నీ
లలితభుజోపగూహననివాసము మానదు ధాత్రి సద్గుణో
జ్జ్వలనరసింహమంత్రబలవంతులకింతలు చిక్కుటబ్రుహా ౧౫౮

యథాసంఖ్యము —

క॥ సమముగ నేరరుపఁడు బాహా। స్థములు దిష్టంబులయ్యెఁ దగ నాపశ్చా
యమూననసూద్దిష్టములై। యమర యథాసంఖ్యమయ్యె నదియెట్లన్నన్ ౧౫౯

చ॥ వరకరుణాధరాభరణవైభవసద్గుణబుద్ధిచాతురీ
పరమవిభుత్వపావనవిభాబలధైర్యవిజృంభణంబులన్
వరుస హరిం గిరిం గళశవార్నిధి గిర్నిధి హంలిఁ గేలినా
కరిఁ గిరి గెల్తువౌర త్రిజగన్నుత శ్రీనరసింహభూవరా ౧౬౦

అర్థాపత్తి —

క॥ వరుసనొకానొకవస్తువు। గిరికొనవస్త్వంతరంబుకిను తన్న్యాయ
స్ఫురితత్వైచను చేరఁగ। ధరనర్థాపత్తియయ్యెఁ దగ నెట్లన్నన్ ౧౬౧

సీ॥ అనుశైలము చిన్నమంతగాఁ గలపోసి యాశాచలము దార మెత్తుఁ జేసె
వెలయ మంథానాద్రి వేళ్లతోఁ బెకలించి మైనాకమబ్ధిలో మ్రగ్గఁ జేసి
యనుపమావంధ్య వింధ్యస్ఫూర్తి సిలఁ బ్రామి మలయాగము క్వేకి వెలియొనర్చి
యలకాంచగిరికిరంధ్రాన్వేష మొనరించి నలిగుబ్బలికి వింతవడఁగు గూర్చి
యడరునీధైర్యమనిన చోనపరగిరులు। సాటిరావనిమతి వేఱ చాటనేల
పోచిరాజాన్వయాంభోధిపూర్ణచంద్ర। వైరిగజసింహ యోబయనారసింహ।

పరిసంఖ్య —

క॥ తలఁపఁగ నొకటియనేక। స్థలముల సంబంధసంగతంబగు నెడలం
బలిమి నొకచో నెనెసిలుప్రట। వెలయుం బరిసంఖ్యయగుచు వినుమెట్లన్నన్ ౧౬౩

సీ॥ అందమై త్రిభువనానందమై జితకుందబృందమై నభమునఁ బెరయు నెద్ది
పొంకమై భృతరక్తపంకమై సమరనిశ్శంకమై నినుతింపఁజాలు నెద్ది
తోరమై దానైకధీరమై సజ్జనాధారమై ధారుణిం బనరు నెద్ది
తండమై చండిమాఖండమై సంభృతాజాండమై పండిమై రేఁగు నెద్ది
విను మనఁ గీర్తి నీ భుజాన్వితకృపాణి। నీ కరము నీ రుచి యకాని నెఱయఁ గాదు
విధుపొంపు గాదు పవి గాదు వేల్పుఱాను గాదు। రవిబింబ మోజభూకాంతపరస.

ఉత్తరము—

క॥ ఎత్తఱి నున్నేయంబౌ। నుత్తరమునఁ బ్రశ్నమదియు నుత్తరము వెస
న్నొత్తమయి పొల్చు నత్తఱి। నత్తఱి నుత్తరము నెగడు నది యెట్లన్నన్, ౧౯౫.

ఉత్తరోన్నేయప్రశ్నోత్తరము—

సీ॥ అలరారు పూఁదీవ యని తలంచితిఁ గాని యుబిఁ సీతనువల్లి యాకుట లెఱుఁగ
నాలోలపల్లవంబని భ్రమించితిఁ గాని చెలువ నీ చేసన్న సేయుట యెఱుఁగ
నళిపాళికాజాతమనుచుఁ జూచితిఁ గాని సుదతి నీ చికురవాల్పెదరు లెఱుఁగ
నలకోకిలాలాపమనుచు నుండితిఁ గాని పడఁతి నీ నెలఁత త్రిపలుకు లెఱుఁగ
నలుక చాలింపు మనుచు నీ యహితనృపతి। తావకోద్భటఘాటికిఁ దల్లడిల్లి
యడవులకు నేఁగి కులకాంత నాదరించు। నరస తాటోపయో జయసర్వభూప,

ప్రశ్నోత్తరమాలికోత్తరము—

ఉ॥ ఎవ్వఁడు దేవతాగురుఁ డహీనశయానుఁడు వక్రవిక్రముం
డెవ్వఁడు రామభద్రుఁడు మహీపలయైకధురాధురంధరుం
డెవ్వఁడు భోగిభర్తజగదేకవిజృంభితదానదీక్షితుం
డెవ్వఁడు పోచిరాజు నరసింహుఁడె వార్ధిపరీతమేదినిన్, ౧౯౬.

వికల్పము—

క॥ సమబలయుతవస్తువులకు। నమితవికల్పంబొనర్పఁ దనఘాలంకా
రమతజ్ఞులమతమున నది। యమరు వికల్పంబనంగ నది యెట్లన్నన్, ౧౯౭.

సీ॥ అలఘు కాంచనమయస్థలనివాసము మేలొ కాంచనస్థవవాసకలన మేలొ
పుండరీకంబులదండ నుండుట మేలొ పుండరీకంబుల దండ మేలొ
మహనీయవాహినీ మధ్యసంస్థితి మేలొ వాహినీశ్వరమధ్యవసతి మేలొ
మహిషసహావాసవిహరణంబులు మేలొ మహిషీసహావాసమహిమ మేలొ
శైలకటకాశ్రయంబులు మేలొ యతని। యంఘ్రికటకాశ్రయము మేలొ యరిపులా
యను మనీశాత్రవుల మంత్రులను నయింతు। ధరిజయాటోపతోరగంటినరసభూప.

సముచ్చయము—

క. మిగులఁ గుణక్రియ లెవ్వెడ। యుగపత్ప్రాప్తంబు లగ సముచ్చయ మక్కృతిం
బొగడఁదగుఁ గా ద్వివిధంబై। యగణితకవివినుత మగుచు నది యెట్లన్నన్. ౨౦౦

గుణసముచ్చయము—

క. నరసింహశౌర్యశోభా। స్ఫురణంబున జగము లెల్ల శోణము లయ్యెన్
బరరాజవదనవితతులు। హరినీలనిభంబు లయ్యె ననవరతంబున్. ౨౦౧

క్రియాసముచ్చయము—

చ. అలకలు ముట్టి ముట్టి జఘనాంబరబంధ్యకిఁ గిట్టి కిట్టి గు
బ్బలఁ గతిఁ బట్టి పట్టి కరపల్లవముల్ నలి పెట్టి పెట్టి యుం
జెలువగు తారహారములు చిక్కులు వెట్టు నృసింహ నీ ద్విష
ల్లలనల నాలి కేఁగ విటులక్షణలక్ష్యములై మహీజముల్. ౨౦౨

ద్వితీయసముచ్చయము—

క. పాయకఖలేకపోత। న్యాయమున ననేకకారణము లొకకార్యం
చేయెడ సాధింపఁగ నుత। మై యపరసముచ్చయాఖ్యమగు నెట్లన్నన్. ౨౦౩

క. శూరతయు సుధీరతయును। దారతయు గభీరతయును ధార్మికతయు నీ
కారణజన్మస్ఫూర్తి వహ। తారము సూచించె నోబక్షరణిపు నరసా. ౨౦౪

సమాధి—

క. కారణ మొక్కటి కార్యము। ధారుణి సాధింపఁగా గతాళనయమునం
గారణము వేఱొకటి రా। నా యూధి సమాధి యయ్యె నది యెట్లన్నన్. ౨౦౫

చ. అని మొన శ్రీనృసింహ వసుధాధిపతి ప్రచమూ సమూహముం
గనుఁగొని యప్పుడు బోదవఖానవజీరులు వేగిల్ల నొల్ల కుం
జొనుపఁగఁ గాకతాళనయశోభఁ దదీయ ముఖాంగులిని చే
శనబులు ప్రాణరక్షణ విచారకృతిక్షమ లయ్యె వారికిన్. ౨౦౬

భావికము—

క. క్షితిలోఁ గనఁబడు తమనా। గతము ను బ్రత్యక్షమువలెఁ గను పట్టుటను
స్ఫుటనిరూపమార్థకథనం। బతిశయముగ భావికాఖ్యమగు నెట్లన్నన్. ౨౦౭

మ. వరవల్గావిభవంబు దష్టభుజగవ్రాతంబుగాఁ సింగణుల్
గురుపక్షద్వితయంబుగాఁ దగ నరస క్షోణీశ్వరారూఢమౌ

తఱఁగోత్తంసము నిందిరాహృదయనాథుం డబ్జప్రత్యక్షబిం
ధురపక్షీంద్రుని లీలఁ జూచు నహితస్తోమంబు భీమంబుగన్, ౨౦౮.

ప్రత్యనీకము—

క॥ పగవాఁడు సమర్థుఁడుగా । నగఁటిమి వెస నతని మీఁద మార్కొనశిల నా
పగవాని హితుల నొంచుట । యగుఁ గృతులం బ్రత్యనీక మది యెట్లన్నన్, ౨౦౯.

క॥ నీదురవగాహశౌర్యము । భేదింపఁగలేక విమతపృథ్వీశుఁ డనిన్
ఖేదించు నృసింహభవ । న్మేదురభయదప్రతాపమిత్రు నిమిత్తున్, ౨౧౦

వ్యాఘాతము—

క॥ ఒకఁడొక్కటిచేత నొకపని । యొకలరికి తఁ జేయ వాని నాపోహతఁ వుచే
నొకఁడుమతి వేఱ చేయఁగఁ । బ్రకటవ్యాఘాత మెన్నఁబడు నెట్లన్నన్, ౨౧౧.

క॥ రాజీవబాంధవుఁడు నిజ । తేజమున నానర్చుఁ ద్రిజగతీతాపమున
వ్యాజవిరాజితతేజో । రాజిన్ హరియింతువౌ బరాజ నృసింహా, ౨౧౨.

పర్యాయము—

క॥ ఏకాధేయంబరయన । నేకాధారంబులందు నిరవైక్రమమును
జేకొనఁ బర్యాయంబును । వాకవిసంస్తుత్యమయ్యె నది యెట్లన్నన్, ౨౧౩.

సీ॥ కంపర్పహరునందుఁ గనువిప్పఁగా నేర్చి శరవణోద్భవునందు శక్తియొత్తఁగి
రామునందచలాంబరముగట్టఁగా నేర్చి జలధిలంఘనునందు జంగయొత్తఁగి
ఘటజునందు భయశతములఁ బొర్లఁగ నేర్చి పెనద్రోణియొడఁ బాలు వేఁడనొత్తఁగి
మొగిపృకోదరునందు ముష్టి పూనఁగ నేర్చి విజయుని యెడఁ గణఁ వేఁధయొత్తఁగి
యనుదినంబును నభివృద్ధిఁ దనరుశౌర్య । శిశువు భవదీయదో స్తంభ జృంభమాణ
ఖురళిఁగాంక్షేయ చాలనస్ఫురణ మెఱిఁగె । వైరిగజసింహ యోబయనారసింహ.

సూక్ష్మము—

క॥ ఈక్షితిఁ బలపోయనసం । లక్షితసూక్ష్మార్థ కౌశల ప్రకటంపై
చక్షుణ్యము సూక్ష్మంబగు । నక్షీణకవిప్రశస్తమది యెట్లన్నన్, ౨౧౪

ఉ॥ ప్రాణమువంటి నాకు నిజభావము దాఁపఁగఁ జెల్లునమ్మ నీ
ప్రాణవిభుం బ్రభూతగుణ బంధురుఁ దెల్పఁగదమ్మ యంచు వి
న్నాణముగా సఖీజనులు నల్గడలం గదియంగ సైకత
శ్రోణి యురంబు మీఁద నఖసూచిక నేర్చె నృసింహ భూవరా, ౨౧౫

ఉదాత్తము—

క॥ విశ్వోన్నతమై చెలఁగెడు । నైశ్వర్యము గలుగు వస్తు వభినుతిసేయన్
శాశ్వతమగుచు నుదాత్తము । విశ్వంభర లోనఁ బొల్చు విను మెట్లన్నన్. ౨౧౭

మ॥ నృపులర్పించినఁ జేలలూడ్చి వెలికిన్ నేర్పొప్పఁగాఁ గుప్పగా
నొప్పుదుం జల్లిన బ్రుగ్గముత్తెములు ధాత్రీశాఁ గదస్వర్ణచూ
ర్ణపుఁ బ్రోవుల్దగు నీగృహాంగణములం దారాద్రి ధాత్రీధరా
ధిపముల్ స్వవ్యయభీతి నిగ్గొలుచు రీతిన్ శ్రీనృసింహాధిపా. ౨౧౮

పరివృత్తి—

క॥ సమమిచ్చి సమముఁ గొనన । ల్పము నిచ్చి యనల్పముఁ గొన నధికంబున నన
ల్పము నిచ్చి యల్పముం గొన । నమరుం బరివృత్తి త్రివిధమై యెట్లన్నన్. ౨౧౯

సమపరివృత్తి—

క॥ శ్రుతిహృదయరత్నభూషా । కృతులు కృతుల్నీకు నొసఁగి కృతులు నృసింహా
క్షితిపవర నీచేఁ గాంతురు । శ్రుతిహృదయాభరణములు విశోభితలీలన్. ౨౨౦

అధికదానాల్పాదానపరివృత్తి—

క॥ నరసింహా నీదువైరులు । కరిసింహములా యభల్లగవయాశ్వాపరం
పరకున్ దమగృహములొసఁగుచు । వరుసన్ భజింతురు దదీయవనమందిరముల్.

అల్పదానాధికాదానపరివృత్తి—

క॥ నరతను వ్రణికరాసికి । నరియొసఁగి నృసింహభూప యనుపమరంభా
పరిరంభ గుంభ సంభ్రమ । భరితామరతాశుభప్రభావముఁ జెందున్. ౨౨౨

కారణమాల—

క॥ ఇల నుత్తరోత్తరములకుఁ । బొలుపొందఁగఁ బూర్వపూర్వములు హేతువులై
యలరఁగఁ గారణమాలిక । యలంకరణరాజమయ్యె నది యెట్లన్నన్. ౨౨౩

మ॥ హరిపాదాంబుజపూజనాభిరతిచే నైశ్వర్య మైశ్వర్యచా
తురిచే సజ్జనరక్షణంబు సుజనస్తోమావనస్ఫూర్తిచేఁ
జిరపుణ్యంబులు పుణ్యవాసనలచేఁ జెన్నొందు సత్కీర్తి యా
న్నరసింహాధిపనీకఁ బొల్చు బుధసంతానైకచింతామణీ. ౨౨౪

ఏకావళి—

క॥ ధరఁ బూర్వపూర్వమున కు । త్తరోత్తరము క్రమసమగ్రతవిశేషణమై
పరఁగిన నేకావళి యన । నరుదగు సత్కృతులయందు నది యెట్లన్నన్. ౨౨౫

క॥ హరివబలాచందనమయి । యరుదగునరూపకంబునమృతాంభోధి
స్ఫురణంబుఁదాల్చెననయెడి । సరసనిదర్శనయుఁబొల్చుసంసృష్టియై ౨౩౫.

అంగాంగిభావసంకరము—

క॥ అసిజిహ్వాభయదంబై । యసమమహాబలవిశేషహారియునై యు
న్నసమభవద్భుజదండము । పొసఁగునృణిమాడ్కినోబళభూవరునరసా, ౨౩౬.

క॥ అసిజిహ్వాకయనురూపక । మసమమహాబలవిశేషహారిశ్లేషం
బెసఁగఫణిమాడ్కిభుజమును । వెసనంగాంగిత్వమొందెఁ దెలియనుపమతోడన్.

ఏకవాచకానుప్రవేశసంకరము—

క॥ విశ్వామిత్రమదాసహ । శాశ్వతసౌభాగ్యమగుచు సతతోన్నతమై
విశ్వనుతశ్రీనృసింహాము । హీశ్వరనీయసివనీషు నీడనుబొల్చున్, ౨౩౯.

క॥ నీవాలువనిన్నునివతే । నేవేళఁదెలంగునన్న వేకపదవిశే
షావిర్భూతములగుచున్ । శ్రీవెలయన్ శ్లేషముపమచెలఁగుననేటన్, ౨౪౦.

సందేహసంకరము—

క॥ హాకారిఖరగరాకా । కోకారికళానుకారికోమలరుచినై
యేకాలమురంజిల్లును । నీకీర్తిమరాళియోబనృపునరసింహా, ౨౪౧.

క॥ ఇలఁగీర్తిహంసియనుచో । సలలితగతిహంసివంటి సత్కీర్తియొకా
కిలఁగీర్తియనెడిహంసియొ । తెలియదుపమరూపకంబు తేటగనిచటన్. ౨౪౨.

క॥ ఈరీతింగొన్నియలం । కారము తేర్పటిచినాఁడఁగడమదడమనే
నేరకవర్జించుటగా । దారయవిస్తారభీతి నాపాదింపన్, ౨౪౩.

శా॥ మక్షామండమపదంపుమాభయదదోర్మాహాత్మ్యధాటీమహో
త్క్షారప్రతిరుద్ధభూభువన హిందూరాజ్యసంస్థాపనా
ప్రాక్షర్యోత్తకులోత్థితధ్వజపటుప్రాయప్రసర్పద్యశ
స్సక్షీర్వీకృతశర్వకంకణనమస్యాజాలకోలాహలా, ౨౪౪.

క॥ సాహిత్యభోజభూజన । సాహిత్యనిదానదానసంతానమహో
బాహాపదానవాహా । రోహణకేవంతలలితరూపజయంతా, ౨౪౫.

వర్గపంచకరహితసుగంధివృత్తము
హారహీరసారసారిహారశైలవాసవా
ర్వ్యపహాహిహారశేషవేషహాసలాలస

శ్రీరసోరుయాశసాంశుశీలవైరివీరసం
హారసారశౌర్యసూర్యహార్యవార్యసాహ

గద్యము,

ఇది శ్రీహనుమత్ప్ర- లబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంకుశ
ప్రతిభా ఘటనరచనాధురంధర ప్రబంధాంక
సుపుత్ర తిమ్మరాజపౌత్ర సకలభాషా
ావధాన శారదామూర్తి మూర్తిప్రణీతం
నరసభూపాలీయంబనఁబ్రాజనామధేయాం
కితంబై పొల్చు కావ్యాలంకార సంగ్రహంబును
మహాప్రబంధంబునం దర్థాలంకార విభా
గంబును సంకర సంసృష్టి నిర్ణయంబు
నన్నది సర్వంబును
పంచమాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీ

